శ్రీరస్తు.

శ్రీ రామచంద్ర పరబ్రహ్మణే నమః.

# గయోపాఖ్యానము,

## జంగంకథ.



వెస్టువార్డుఅండు కంపెని.

చాకలపేట, మదరాసు.

கயோபாக்யானம் - ஜங்கம கதை.

1943

# ఆయుర్వేద వైద్యశాల.

| | |
|---|---|
| హెడ్ ఆఫీసు, కోరంగి, గోదావరి జిల్లా, చెన్నపురి రాజధాని, | బ్రాంచి ఆఫీసు, కాకినాడ, జగన్నాథపురం, ఫాస్టరుపేట. |
| **నారసింహ లేహ్యము.** | **లోహాభ్రకసిందూరము** |
| 40 తులములు రు 12-0-0 | 1½ తులం రు 9-0-0 |

ఈ యౌషధరాజముల రెంటిని మా వైద్యశాల స్థాపించిన 1890 వ సంవత్సరములకు పూర్వము (ఇప్పటికి 40 నలుబది సంవత్సరముల క్రిందటనే) పేరుకనిపెట్టి అప్పటినుండియు బర్మా. సిలోన్ స్ట్రెయిట్సు శెటిల్‌మెంట్సు మొదలగు అన్యదేశములయందును, హిందూదేశమందలి అన్ని భాగములయందును, విక్రయించుచుండగా. వీటిసమర్థతకు సుకీర్తిగాంచి అనేక యోగ్యతాపత్రికలు, బంగారుపతకములు, యగ్జిబిషనులలో ఫస్టుక్లాసు సర్టిఫికెట్లనుబొంది జగత్ప్రఖ్యాతి నొందియున్న దను విషయ మీ దేశమందెల్లగనివారు లేరు

ఈ పేర్లతో ఇతరులు ప్రచురించుచున్నవి నిజమైనవి కావు

మేమే ఈ రెండౌషధముల కీ నామములనుంచితి మనియు ఈ పేర్లు ఆయుర్వేదమందే గ్రంథమునను లేదనియు, ఆయుర్వేద వేత్తలందఱకును విశదమే.

ఇవి సమస్త నూతన పురాతన సుఖవ్యాధులను; వాటిచేగల్గు నేత్రరోగములు నడుము కీళ్లు నరములనొప్పులు సలుపులు, దద్దులు దురదలు. పుళ్ళు. రహస్యస్థలములయందు పుండ్లు మొదలగువాటిని, సవాయి జీర్ణించుటచే గలిగెడి శుక్లనష్టసంబంధమగు సర్వమేహములను అద్భుతముగ నివర్తిచేసి, రక్తమును, ఇంద్రియమును, శుద్ధిపఱచి వృద్ధినొందించుటయందు గల సమర్థతకు సుకీర్తిగాంచి జగత్ప్రసిద్ధినొంది అనేక యోగ్యతాపత్రికలు బంగారుపతకములు, యగ్జిబిషనులలో ఫస్టుక్లాసు సర్టిఫికేట్లను బొందియున్నవి. మఱియు ఈ వైద్యశాలయందు ఆయుర్వేదోక్తముగ నిష్కళంకముగ చిరకాలానుభవమున మాచే తయారుచేయబడుచున్న శతపుటకృష్ణాభ్రకభస్మము మొదలగు (21) రకముల భస్మములు పూర్ణచంద్రోదయము మొదలగు (30) వంటౌషధములు, నూతికాభరణము మొదలగు (31) ఖజ్జలీయౌషధములు, (5) రకముల లేహ్యములు, చూర్ణములు, మాత్రలు, తలనూనెలు మొదలగు (120) రకముల ఔషధములును, మా హెడ్డాఫీసు, బ్రాంచాఫీసునందుగూడ విక్రయమునకు సిద్ధముగనుండును

ఈ యౌషధముల గుణానుపానాదుల నొక ఘనవైద్యునిచే దెల[illegible] అనుపానమంజరి యను (1) ఒకటవ నెంబరు కేటలాగు (5) రూపాయల ఔషధముల గొన్నవారి కొకప్రతి బహుమతిముగ నంపెదము.

ఈ (120) రకముల ఔషధములయొక్క వెలలు గుణములను దెలుపు (2) రెండవ నెంబరు కేటలాగును గోరినవారికి ఉచితముగ బం[illegible]

అడ్రసు:—పొన్నమండ లక్ష్మణస్వామి,

డిసెంబరు నెల. 1925 సం॥

ప్రొప్రయిటర్, ఆయుర్వేద వైద్యశాల, కోరంగి, గోదావరి జిల్లా, చెన్నపురి రా॥

నవీనడాంబిక ప్రకటనల నమ్ముటకంటే చిరకాలమునుండి ప్రసిద్ధినొందియున్న ఔషధములరప్పించి గుణములు గ్రహించుట మిగుల లాభకర

# GAYOPAKYANAM.

శ్రీ ర స్తు.

శ్రీరామచంద్రాయ నమః



# గయోపాఖ్యానము,

## జంగంకథ.

---

దేసింగురాజుకథ వర్ణమెట్టు ప్రకారము.

ఉ. శ్రీపద్మామణి హృద్విలోలు గరిమన్ సేవించి ప్రార్థించెదన్ ।
పాపధ్వాంతపతంగు నార్యవినుతున్ భావంబునన్ వేడెదన్ ।
ప్రాపో భారతి గొల్తు నబ్జభవునిం బద్మాక్షు గీర్తించెదన్ ।
ఆపద్బాంధవు డూళపాలపుర కంసారాతికే మ్రొక్కెదన్॥
శ్రీలక్ష్మీకుచకుట్మలస్థగిత కాశ్మీరార్ద్రవక్షంబుతో ।
కాలాంభోదరనీలఫాల విలసత్కస్తూరి చిహ్నంబుతో ।
బాలార్కారుణ హేమచేలములతో భక్తాళిపై ప్రేమతో ।
పాలింపన్విలసిల్లుమూళపురి గోపాలాభిధానంబుతోన్॥

క. గజరాజవరదశౌరీ । నిజముగను జేరి కోర్కె నెరవేర్పుహరీ ।
అజజనకమధువిదారీ । భజియించెద నోరిమూళ్ళసారమురారీ॥

శా॥ ప్రారంభంబున విఘ్నమ స్తుసుచు నిన్ బ్రార్థింతు హేరంభను ।
ద్వారాభీష్ట ఫలప్రదాతచుత విద్యాన్ లోకవంద్యా భవ ।
త్కారుణ్యామృతదృష్టిజూడు మిదె మత్కావ్యంబు సేవ్యం బగున్ ।
రారా ప్రొముక్కెద మూళ్ళపట్టణవిహారా విఘ్నరాజేశ్వరా॥

గీ॥ అభిమతార్థంబులొసగెడు హైమవతిని । అఖిల సిరులిచ్చి రక్షించు అబ్ధిసుతను । పలుకు తేనెలనిడు బ్రహ్మసతిని । పరగ నీ ముువ్వురను భక్తి నాత్మ దలతు॥

గణేశ్వరప్రార్థన కీర్తన.



ఆరభిరాగము - ఆదితాళము.

గణనాథాదేవా - గణనాథా ప్రణుతిసేసెదరావా - గణనాథా॥
ఫణివరభూషణ - పరిజనపోషణ- ఝుణాతఝుణుత- కిట్తకతోధణ తధిం తధమితధమి - కిట్తకతోధణ - తధింతకధితతోం - దధిగిణతోం గిణతోం॥

గిరిజాతనూజ - సరసీరుహాభవ సురేశ్వర - సురవందిత ధరకిట్తక - ధరకిట్తకి - కిట్తకి త్తతాధి-తకిటతకిటతకి - దాటతకిధరిట తకితద్ది - కిట్తకిధరికిట తద్దితరిట తద్ధి॥ గణ॥

ప్రాభవమొప్పగ కూళ్ళపురన - కృపామతివై విలసిల్లుచుందువుమ దేభేంద్రానుకోడూరి వోబమాభి గీతార్థము లొసగెడు దొరవా॥ గణ॥

ఆనందభైరవి రాగము - చాపుతాళము.

సరస్వతి మతియొసంగి నను బ్రోవగ రావమ్మ - నమస్కారమొనర్చెద॥ సర॥ శరబలరకనికరంబుననునీ - కార్యమున్నను - గారవించవె తల్లి

పరాకుసలుపరాదు - నాదమొరాలించి బిరానవర మొసగరా - వినని కరామరాశనరాకనరాపున రాబతల్లిమా॥

వాణిమధురవాణిపృధులగుణీ విధురమణీ - మలినీలవేణిపరమకల్యాణి వీణాదండపాణి ప్రణామంబు గావింతు॥

వనరుహావదనా అనయమునారిహృదయమున నమ్మినారన యూళ్ళపట్టణవాసినీ జననివోబయాఖ్య మానసపూజితే॥

కథాప్రారంభము వంశావళి క్రమము.

# కథాప్రారంభము.

---

రగడ.

శ్రీవసుదేవకుమారాధీరా శ్రితజనమందారా
కేవలపరమోద్ధారా శ్రీధర కేశవభవదూరా
భోగిశయనరవికీర్తివిశాలా బృందావనలోలా
ఆగమవేద్య జనాద్భుతలీలా అగణితగుణజాలా
క్రూరదనుజసంహారామన్మథ కోటిసౌకుమారా
ఘోరదురితపరిహార భువనాకార మేరుధీరా
అప్రమేయ బ్రహ్మాండమహోదర అఖిలహృదయవిహారా
సుప్రకాశ నిఖిలేశ పరాత్పర స్వామియంతకహరా
సర్వము నీవయి యేమియెరుంగని నిర్వికారుడవురా
యుర్విలోదుష్టుల జంపనుజనుల నొప్పగ పోషింప
ధారుణీస్థలి విష్ణుండవయి యవతార మెత్తినావె
వారిజాక్షుధర నూళ్ళపాళెపురి వాసజిద్విలాసా
నందకుమారదయానిధే నీవయి యంకితమొప్పగను
పొందుగ నేనొక సత్కథజేయగ బూని తదెట్లనినా
శ్రీగణనాథుని ముందుగమనమున జేర్చిసన్నుతించి
ఆగమరూపిణియయిన సరస్వతి నభిమతి గావించి

పూర్వకవులగు వాల్మీకివ్యాసుల పొందుగ వినుతించి
సర్వసమర్థకవీశ్వరరాజుల సంభ్రమమున నెంచి
పన్నగశాయినిజదాసులను ప్రార్థన మొనరించి
నన్నయతిక్కన పోతనామాత్యుని నెన్ని సన్నుతించి
బహుళప్రబంధనిర్మాతభాస్కరుని భావంబున వేడి
మహితసులక్షణ ఛందోకవిత్వ మహిమనుకొనియాడి
అల్లికయుక్తులు మెచ్చగ సుకవిజనావళి వినుతించి
కుళ్ళుబోతులగు కుకవిదుర్మతుల నోళ్ళుమూయబంచి
సరసమతులశాస్త్రజ్ఞుల పండితజనులు వితర్కించి
భరతశాస్త్ర నటగాయక పరిహాసపరుల ప్రశంసించి
హర్ష మొదవగా దెల్పెదనాదు వృత్తాంత మెట్లనిన
పరమయోగ్యమయి కలుషహారంబగు బ్రహ్మకులంబునను
బుధజనాప్త టార్వేలకులోద్భవుడు దయామయుడు
మధుసంహారు నారాధనజేసే మహితకీర్తిపరుడు
పరమశాంతగుణు డార్యసన్నుతుడు బ్రహ్మవేత్తదాత
కరమగునాంధ్ర కవిత్వనాటకాల్ గావించిన మేటీ
ఘనుడగు ధేనువుకొండనుపిచ్చయ కవివరుడనబఱగి
వనితారత్నము కనకాంబయను వనితపెండ్లియాడి
మందగమనయగు కనకమాంబకు మంచిపతివ్రతకూ
పంచబాణులను నేవురుసుతులను గావించె పెంచిరందూ
నాలవతనయుడ వేంకయమాత్యుడ నరహరిభక్తుడను
చాలగమును నేనాటకము నవలీల రచించితిని
ధరనుప్రశస్తంబగుటచూచి యొకధన్యుడు మోదమున
సరసుడుతనపయి నంకితంబుగా సత్కథ జేయుటకై
అంతరంగమున దలచినన్ను రమ్మనుచు జాబువ్రాసి
సంతసమున నాకనుపనేగని యాంతర్యము దెలిసి
కూరిమితోనొక సంతతి నతనికి కృతియొనర్తు నిపుడు
ధారుణిలోకృతి గోరగనంతటి ధీరు డెవ్వరనిన
భూరియశోదను డూళ్ళపాళెమను పురనివాసు డతడు
శ్రీరంజిల్ల కోవూరికులాంబుధి కైరవబాంధవుడు

నిబ్బరనుడంకమ్మలయుడు నీతికోవిదుండు
సుబ్బమాంబికను పెండ్లాడిరువుర సుతులగాంచె నందు
అగ్రజుడంకమ నాయుడతని కిల్లాలు లక్షుమాంబ
ఆగ్రహదూరుడు ఘనుడుద్వితీయుం డనుగ్రహమతియుతుడు
పిచ్చయు నాయుడు ఆదెమాంబను ప్రేమతో పెండ్లాడి
హెచ్చుగ మువ్వురసుతులగాంచి పేర్లేర్పడగానిడిన
అంచితంబుగ వెంకయ్య ఓబయ్య చెంచు కృష్ణులనగ
పంచబాణరాధేయవిధుల మరపించిరి మువ్వురును
వారిలో మధ్యము దుర్వినికోచూరి వంశభూషణుండు
శూరుడు కంకనాయునివర స్వీకారపుత్రుడతడు
గానలోలు డసమానవిక్రముడు మానినిమన్మథుడు
మానధనుం డిలదానగుణంబుల భానుపుత్రముండు
చంద్రనిభాద్భుత కీర్తిపరుడు హరిశ్చంద్రుడు సత్యమున
ఇంద్రభోగియడరి మదమాతంగ మృగేంద్రుడనం బరగూ
మేరుధరాధర ధీరుడఖిల వ్యవహార ధర్మవిదుడు
పేరుగొనియె ధనమునకు ద్వితీయకుబేరసముడు ధరలో
అవనీసురవరపక్షపాతి యాహవఫల్గునుడు
ప్రవిమలచిత్తుడు యిన్నిట ఘనుడన బఱగి ప్రబలు డయిన
నరహరిభక్తుడు కోచూరవోబయ నాయునికృతియనగ
వరుసతో గయునిచరిత్ర మదియును విరచిత మెట్లనిన
పెండ్లికట్నమునుదీర్చి బురాన్ పురి ఖాండియలను దొడగి
నిండువేడుకతో సరిగెపుటంబుల నీమజామ దొడగి
వారపాగలను జుట్టి జల్తారుతువాలాల్ చేపట్టి
ధారుణిలోపల స్థలపతిజంగాల్ తంబురను మీటి
దిట్టతనంబున కంచుగుమ్మెటల్ పట్టున జోడించి
అట్టహాసమున పదమున గెజ్జలు అందెలు మ్రోయగను
తధిమి తధిమియని నాట్యముసలుపుచు పృథివిభావమదర
మధుర ప్రసంగాలాడుచు సభికుల కధికసంతసమున
వొప్పుగ సంగీతామృత మధురస ముప్పతిలుచు నుండ
కుప్పలింపుచును జంగములకథ చెప్పెను చోద్యముగ

శివమతస్థు లగు జంగములకు నిది జీవధనంబనగ
అవనియూళపురి శ్రీగోపాలున కంకిత మొప్పగను
హర్ష మొదవ గయుని చరిత్రమునందు కథను బాగబాగా
సరవిమధుర రసోక్తులను కవీశ్వరులు లరయ చమత్కృతిగా
దరువులు రగడలు గద్యపద్యములు సరసవచనములను
కరమరుదుగ రచియించెద యీకథ క్రమమది యెట్లనిన
మదనజనకు డగు యూళపురీశుని మహిమను గొనియాడి
పదపడి వినుడీకథ పూర్వోత్తరభాగంబులు సరిగా॥

వ. మరియు నమ్మహనీయ గుణగరిష్ఠు లగు నమ్ముని శ్రేష్ఠులకు నిఖిలపురాణ వ్యాఖ్యానవైఖరీసమేతుం డయిన సూతుండు హర్షనిర్భర చేతస్కుండయి గయోపాఖ్యానం బను మహా ప్రబంధంబు వివరించెద సావధానంబుగా నాకర్ణింపు డని యిట్లనియె.

### కథా ప్రారంభము.

శ్రీవైకుంఠనివాసు డనంతుడు చేతోభవగురుడు
భావాతీతు డజాండగర్భుడిల భారముడుప దలచి
మందరధరుడా దేవకీసుతు డయి నందునింట బెరిగి
బృందావనమున గోగణంబులను పొందగ గాచుచును
క్రూరులమయిన కంసాదిరక్కసుల ధారుణి బడగూల్చి
ధీరుడు పశ్చిమవారధిలోగల ద్వారకపురమునను
ప్రభు డయిన సకలైశ్వర్యములతో పరమానందముగ
త్రిభువనముల కధినాథుడనుచు ప్రజలు వినుతిసేయగను
అష్టభార్యలు రాజస్త్రీలు పదహారు వేలు గొల్వ
ఇష్టసుఖంబులతోడ నటింపుచు యేలుచున్నవాడయి
వనజదళాక్షుడు యూళపురీశుడు వసుదేవుని సుతుడు
అనయము నిష్ఠతో సత్యవ్రతమునొక టాచరించుచుండె॥

వ. అమ్మహాపురుషుం డగు దేవకీనందనుడు ద్వారకాపురంబున కధినాథుం డయి యిష్టోపభోగంబుల సుఖింపుచు ననుదినంబులు సూర్యోదయంబునకు ముందుగా లేచి యొక్క సరోవరంబు జొచ్చి మజ్జనం బాచరించి కమలాప్తుని కర్ఘ్యప్రదానం బొసంగి యనంతరం బఖిలవ్యవహారంబులు విచారించుకొనువాడు నయి యుండగా నొక్కసమయంబున.

దర్వు - శ్రీరాగము - ఆదితాళము.

పల్లవి.

గోపాలమౌళివెడలె - కాంతలవిహారము॥

అనుపల్లవి.

ఆపాగా కేళివిలాసుడు - గోపగోపికాపరివృతుడై॥

చరణములు.

హారిమణిమౌళిధరించి - మౌక్తిక తురాయిమైదొడగి- పద్మరాగ శారాశిలారత్నహారాలంకారుడై - విరాళిమెరయరాజవరపూజ్యుడు॥ గో॥

ప్రియంబలర గాంగేయాంబరంబుల - హాొయల్ మీరదాల్చియన యముగ్ నిశ్చయ హృదయానందు డతిశయాద్భుతా - భయాకృతా కారుడు॥ గో॥ కామజనకుడుభవహరణుడుహరి - కంజనేత్రుడమాళ్ళపురిసుజన ఫలదాయకుడై - కోమారివోబులరాయతిమదిగా యనినధీరాత్ముడు॥ గో॥

వ. ఇట్లు శ్రీకృష్ణుడు నిజభార్యాష్టకంబును రాచకన్యాషోడశసహస్రమును బరీక్షింప నిజపరివార సమేతంబుగా వనవిహారంబు నాచరింప నుద్యుక్తుండై యిప్పుడు.

కథ.

రైవతకాగము చందనాద్భుత రమ్యమైన వనము
దేవేంద్రుని నగరోపవనమునకు దీటగు నావనము
చెలువమైన యారామవైఖరిని జెప్పనలవిగాదు
జలజాకరములు సెలయేటు లనిమిష నిలయమైన గుహలు
పారిజాత హరిచందన వరమందార మహీజములు
నారికేళ హింతాలతాల జంబీరవృక్ష తతులు
సరసకదంబ తమాలబిల్వఘన సారమహీజములు
మరువకమల్లిక సింధువారములు మదనమహీజములు
పనసజంబు జంబీరవృక్షములు బదరీభూజములు
వనకాంచన కరవీర కేతకీ వకుళ భూరుహములు
కుంద కురంటక భల్లాతకభూజములు కోవిదారతరులు
పొన్నపొగడలు తుంగలవంగలు పోకమహీజములు
అన్నివిధంబులు తరువులు గలవిక నెన్నదరముకాదు
అతిమనోహర మయినవనములో నపుడు మురాంతకుడు

సతులగూడివిహరింప దొడంగెను సంతస మలరగను
మురళిగానమును పాడుచు కృష్ణుడు మృగముల దరుముచును
హరినిచయంబుల గుంపులుజేయుచు తరుణులగనుమనుచు
అంచితంబుగా ఖగములబట్టుచు నంతట విడుచుచును
పంచవన్నియల చిలుకలబట్టుచు పడతుల కిచ్చుచును
పరిమళనుగ్గలమైనచేమంతులు మరిమరి గోయుచును
సరగునపుష్పొడి తరుణులమీదను మరిమరి గుప్పుచును
కమ్మతెమ్మర లివ్వగ కాంతల రమ్మని పిలుచుచును
ఈపొదరింటిలో యుందమనుచునొక యింతిని జీరుచును
దాపుజేరి యొక భామను రమ్మని తరువునీడననుచు
హితమతితోయొక లేమనెత్తుకొని యెనసిముద్దు కొనుచు
లతలమాటుకటు గొంచుపోయి సమరపూరదెల్పుమనుచు
అబ్బురంబుగా నొక్కతలోదరిని గుబ్బచన్నుబట్టి
కబ్బమొసంగిన రీతిగనీజడ దెబ్బగొట్టుమనుచు
ఒక్కసరోజదళాక్షిదుగో నావద్దకి రమ్మనుచు
చక్కెరమోవిసుధారస మిమ్మని మక్కువదెల్పుచును
జలజనాభుడు యింతులకందరి మూర్తులు గన్గొనని
పొందుగయిష్టము సల్పుచునప్పుడు భువనమోహనుండు
మారకోటిసుకుమార సుందరాకార శరీరుండు
కోరికలలరగ తరుణులతో కాంతార విహారమున
దనివిజాలక రండిరండనుచు తరుణుల బిలచుచును
ఒనరుగనొక్కసరోవర తీరము ననువుగచేరగను
అంతలోసూర్యుడు సంతసమలర హస్తాద్రికినేగె
అంతటసంధ్యా రాగమొప్పగా నాసమయంబునను
నందనందనుడు కొలనుకొచ్చితా సంధ్యవార్చిరాగ
మందిరముల కడనుండి తెచ్చినవి మంచిపదార్థములు
మధురసాన్నములు శాకపాకములు దధిఘృతయుతముగను
పీరకృతంబుగా కదళీపత్రములు వేసివడ్డింపుచును
పొందుగశౌరి భుజింపగ సుందరులందఱు భుజియించి
అందరుగూడుక హరిపాదప్రక్షాళనమును జేసి

ఉల్లమలరగా చల్లనిగాలికి మెల్లనదిపుగుచును
వల్లభుడగు ధరనూళపురీశుని వద్దని తమకమున॥

వ. అయ్యవసరంబున నంధకార బంధురంబయి తారకాగణంబులు ప్రకాశించుచుండ కైరవాప్తుం డుదయించెనట యెటువలెను.

గీ॥ పూర్వదిక్సతి నెరికురుల్ ముదముతోడ । దువ్వివైచిన దంత పుదువ్వెననగ । షోడశకలాభిరాముడై సొబగుమీర । చంద్రుడుదయించె సంతోషసాంద్రు డగుచు॥

వ. ఆసమయంబున గోపాలదేవుండు పూపొదరిండ్ల మధ్యభాగంబున సొక్క విశాలస్థలంబు గాంచి యచ్చట శయనించుట కనుకూలంబయిన తత్ప్రదేశంబున తల్పంబు వేయుడని శ్రీకృష్ణుం డాజ్ఞాపించిన సంతసంబున నక్కాంతామణు లప్పుడు.

కథ.

మురియుచువెన్నెల బయలునజేరుక ముచ్చటలాడుచును
వరుసగతల్పము లేర్పడబరచిరి వనితలంత గూడి
మెత్తలువైచిరి చిత్రకబళము లాదిగాగ బరచి
చిత్రపుపట్టుదుకూలములును పై జేర్చిరి మోదమున
చిత్తమురంజిల సుమములుచల్లిరి చక్కగ శయ్యలపై
అత్తరు పన్నీరమరగజల్లిరి మామృదుతల్పమున
భామలువైచిన పానుపు గనుగొని పరమానందముగ
తామరసాక్షుడు పవ్వళించె మృదుతల్పములను జేరి
ఒప్పుగనింతులు హరినిగూడి ముదముప్పతిల్లుచుండ
కప్పురవిడియము లొసగిరికాంతలు కమలదళాక్షునకు
అత్తరు కొందరు పంకా వేసిరి అంబుజనాభునకు
సత్తుగ గొందరు పాదసరోజము లొత్తుచున్న వేళ
సద్దుమాను డని తెల్పిశౌరితా నిద్దురపోవగను
ముద్దియలందరు బవ్వళించి రతినిద్దురపాటునను
రెక్కలుదట్టుచు చరణములను కొనముక్కున దీటుచును
కొక్కొరొకోయని కూయదొడంగెను కుక్కుటములు ధరలో
జక్కవగుములకు మక్కువలెల్లను మిక్కుటంబులాయె
ఆక్కజంబుగా దిక్కులన్ని తెలుపెక్కసాగెనపుడు
అంబుజాళి వికసించె కైరవము లన్నియు ముకుళించె

అంబరతలమూరుద్రవర్ణమై యమరియున్న వేళ
సురకాంతామణి దేవిరత్నముల మెఱపుదీపమనగ
గురుతుగ పూర్వదిశాంగనదిర్చిన కుంకుమబొట్టనగ
అపుడు ప్రభాకరు డుదయమాయె తమమంతయు సమయగను
తపనుని పుదయాత్పూర్వమూల పురిధాముడు హరిలేచి॥

వ. సర్వేశ్వరుండగు గోపాలశేఖరుండు పూర్వోక్తక్రమంబుగా సరోవరంబుజొచ్చి స్నానమాచరించి ధౌతవస్త్రధారణంబుజేసి వారి తిరంబున దర్భాసనంబు బఱచి దానిపై నాసీనుండై యప్పుడు.

క థ.

నీరజనాభుడు సంధ్యవార్చుటకు నిర్మలచిత్తముగ
కోరికలలర పవిత్రమంత్రోచ్చారణ జేయుచును
పదపడిశిరమున నంగుష్ఠముచే నుదకము చిలుకుచును
విదితముగాగల వేదవాక్యమును వేడ్కతో నుడువుచును
హర్ష మొదవగా నాచమనత్రయమనువుగ జేయుచును
ఇరువదినాలుగుమార్లు వార్చనను శిరమున పదములును
ఒనరుగ జేయుచు భాస్కరమంత్రము వారకపఠియించి
మంజుభాషణుడు అనలాస్త్రంబను మంత్రజపము జేసి
అంజలిపుటమున నుదకముయెత్తెను అంబుజనాభుండు
వరగ బ్రహ్మకరదండములప్పుడు బాగుమీరబల్కి
సరసుడు సూర్యునకర్ఘ్యమొసంగెడు సమయములకు సరిగ
వనజదళాక్షుని దోసిట నిష్ఠీవనముబ్రాలె నపుడు
కనుగొనకృష్ణు డసహ్యపడుచు తనమనమున కోపించి
గ్రక్కునయెరిగి ధరణివైచితన మనమున కోపించి
యెక్కడనుండి వచ్చెనోయని నలుదిక్కులు చూచుచును
తిట్టుచు రౌద్రమునలేచి తానట్టన నిలుచుండి
అట్టహాసమున నూలపట్టణ మురాంతకు డిట్లనియె.

గీ॥ ఎందుచూచిన యెవడు లేడేమిసేతు। పొంచియింతమటుమాయలవ నిగలవె। కళ్ళేవైచినముసుముచ్చుగానబడిన। రూపుమాపకవిడుతునే రూఢిగాను॥ వ. ఏను జగదీశ్వరుడనై యుండి భానునకర్ఘ్యంబొసంగగా మదీయ

పురంబున నిష్ఠీవనంబు వైచినట్టి మదాంధుం డెవ్వడోయని శ్రీకృష్ణుండు తన మనంబున కచ్చెరువును రౌద్రంబును అసహ్యంబును ముప్పిరిగొనుచుండ డోలాయమానమానసుండై యున్న జలజగర్భునితో జలదేవుం డిట్లనియె.

క థ.

దేవదేవనిఖిలైకపరాత్పర దేవకీవరతనయ
సావధానముగ దెల్పెదవినుము నీయన్వయ మేటికిని
నిష్ఠతో సూర్యుని కర్ఘ్యమొసంగగ నీదు కరపుటమున
నిష్ఠీవనమును వైచినట్టి యాదుష్టు డెవ్వడనిన
మహావెలయు నివధాద్రియందుగల మణిపురవల్లభుడు
మహదైశ్వర్యమదాంధుడ జేయుడు మణిమంతుని సుతుడు
గంధర్వాధిపు డతనిపేరు గయు డంబుజాక్ష వినుము
సింధురవైరిపరాక్రము డవని సిద్ధుడు సాహసుడు
వనజసంభవుని సన్మానంబున వరముబడసినాడు
ఘనుడనేక మహదస్త్రశస్త్రములు గలిగియున్నవాడు
ఘోరరణంబులలో జయించి బహుపేరుకొన్నవాడు
నూరువేల నిజభార్యలు గలిగిన ధీరవర్యుడతడు
అంబుజగర్భుని నష్టమనాటకుల కధినాథుం డతడు
చక్కదనంబున చక్కెరవిల్తుని ధిక్కరించినాడు
మిక్కిలి యెవరని లెక్కలేకపొగరెక్కి యున్నవాడు
సర్వసులక్షణసంపన్నుడ నని గర్వించిన వాడు
దుర్వివాదముల జనులనందఱ దూరుచున్నవాడు
అట్టిగుణంబుల వాడుగయుడు నేడేకువ నటులేచి
చుట్టునమార్జనమాజేసి చుక్కబొట్టమరగ దీర్చి
క్రొత్తమెరుంగు పసిడిపుట్టములు కొమరుమిగులదాల్చి
ముత్తియములపై గూర్చిన చిత్తరు కత్తలంబు దొడిగి
మరకతవైడూర్యాదిచొకాటపు మాళిధరించుకొని
వరనవరత్నమయంబగు హారములు రథమున ధరియించి
సొరగుకుంగసనక్కడ పులిగోరు మెడనువైచి
వారిజాక్షనిభమయిన యుంగరాల్ వరుసగ వ్రేళ్ళనిడి
శ్రవణములకు వజ్రాలుగూర్చిన చౌకట్లమరించి

తనరుచు శోభిలుపాదుకలుధాతు మెరయగ దొడగి
మేలగుజల్తరు గల్గుదుకూలము మేననునమరించి
పీలగు సాతవిమానము దెమ్మని నిజముగ దెప్పించి
చారుపుష్పకమునందు వసించెను చారులుబొగడగను
ప్రియభటోత్తములు కొందరు గొల్వగ గయుడు ముదంబునను
హాయలుగమీసము దీటుకొనుచుతా బయలు దేరినాడు
ఆకసమార్గము బట్టిబ్రహ్మపురి కరుగుదెంచువాడై
కేకరించి యిపుడుమ్మివై చె నీకరపుటంబునందు
ఇంతదురాత్ముడు బ్రతికియున్ననిక నేమిసేయగలడో
శంతగించి యీఖలునివధింపుడు పాపమనగవలదు
లోకేశ్వరు డభయూలపాలపుర గోకులమందార
నీకె యీపనిజేసినాడు నేనేమనందువాని॥

వ. దేవా నిఖిలేశ్వరుండవు బంధమోక్షణుడవు వసుంధరాభారంబు నివారింప నవతారంబెత్తిన మహాపురుషుండవు గావున నీవెరుంగని తెరంగెయ్యదియును లేదైనను నాకుదోచిన విధంబున నేను విన్నవించితినిప్పుడు భవదీయంబగు దివ్యజ్ఞానంబున నభోమార్గంబుపలక్షింపుము నీకపకారం బొనర్చిన చపలాత్ముం డదే పోవుచున్నాడని యనగా దేవి యిట్లనియె.

దరువు - రాగం - ఆదితాళము.

అదుగో చూడుము అంబరవీధిని॥ అదుగో॥
పటురయమున బ్రహ్మకడకు బోవుచున్నా॥ డదుగో॥

మిడిసిపడుచుమేల్ తొడవులుదొడిగియు - జడుడుమణిమంతునికొడుకుతుంటా డుకు॥

మాయకాదువాడు వాడుమహినిభక్త ఫలదాయకయూలపురీధామ శ్రీగోపాల - వోయుపేంద్రకోచూరి నోబులరాయువరద కాయవలదువీని॥

వ. అని యిట్లు చూపించిన గోపాలుండు కోపాటోపంబున వియత్తలంబు వీక్షించి బలదేవసాత్యకుల నవలోకించి యిట్లనియె.

దరువు - ముఖారిరాగం - అటతాళం.

పాపాత్ముడెవడో - హాతమొనరింతు॥
తాపేరుమాయూ యీపని జేయూ॥

ఆపగాధరుడంబుజోదరు పురందరు - ముఖదిశాధిపులేపుమీరగ - నొక్క మొగిజంపకావచ్చిన తరిమియిపుడీ॥ పాపా॥

అనవరతమ్ముఁ బరగతి దనరుకృతమ్ముఁ - సుకృతిమతినినునకర్ఘ్య మిడను కరపుటమునను నిష్ఠీవనమువైచిన॥ పాపా॥

భానువిధులుకళావిశేష విహీనులయినను నుడుగణము వ్రాలినగాని మేరుకురధరము తలక్రిందైన ప్రతినమాన నేడింతట॥ పాపా॥

ఘోరతరచక్రాయుధంబున - క్రూరునిశిరము ద్రుంచివైచెద - ధారుణీస్థలి యూళ్ళపాలమురారి నాపేరెరుంగడె॥

ఉ॥ ధారుణిదిద్దిరందిరిగితల్లడమొంది చలించిక్రుంగిరన్ । వారధులేడుబొర్లినను వాసవుడడ్డమువచ్చికాచిరన్ । వారకచక్రధారలను వానిశిరంబిల గూల్పకున్ననా । పేరుమురారి యేనువిడిపించిన యూళపురీశుడందురే॥

వ. శ్రీమదఖండ మండలాకార బ్రహ్మాండభాండోదరుండగు శ్రీకృష్ణుండు సుదర్శనాయుధంబున గయుని శిరచ్ఛేదంబు జేసెదనని అతిఘోరంబుగా ప్రజ్ఞజేయుట వినుచున్నవాడయి సుర పథవాణీకరుణాయత్తచిత్తయై సరసిజభవు పురంబున కరుగుచున్న గంధర్వునకు ప్రత్యక్షంబై యిట్లనియె.



హాటకనిర్మిత మయినచౌకాటం బయినవిమానమున
నీటుగుల్కగా విధివసించి పరిపాటిగ చెన్నొంది

అంబరవీధిని బ్రహ్మపురమున కరుగుదెంచువాడ
కుంభినిలో శ్వేతలిదండ్రి నిను కోరికతో గనిరా
ఘనుడవు మురియుచుముందు హీనగతి గానవదెట్టనిన
వనజదళాక్షుడు ద్వారకవాసుడు వసుదేవుని సుతుడు
సరసుడు నేడు వుషస్సమయంబున స్నానమాచరించి
హార్ష్య మొదవ నతిభక్తితో సూర్యున కర్ఘ్య మొసంగగను
అంగజజనకుని కరపుటమున నీవెంగిలివైచితివి
మంగళవిగ్రహుం డమితకోపమున మండిపడుచు లేచి
అక్రమంబుగా నేడు కరపుటమునందు నుమ్మివైచె
వక్రునికంఠము ద్రుంచివైతు నాచక్రముతో ననుచు
ధీరుడు నందకుమారుడు ఘోరప్రతిజ్ఞ జేసినాడు
వారిజనాభుడు జేసిన శాబ్దము వారణ జేయుటకు
హరిహరాదులకు అష్టదిక్పతులకైన నలవికాదు
నిజముగ నందకుమారుడీక్షణము నిన్ను గూల్చునయ్య
ధరను యూళపురిశొంది ప్రతిజ్ఞయు తప్పబోదుసుమ్మా
జరిగినవిధమిది నీదుపురాకృతి సంచితమేలాగో॥

వ. ఓయి గంధర్వరాజా నీవు సత్పుణ్యచారిత్రుం డవమాయికుండవ తి సుకుమారకుండవగుటంజేసి నీయందు దయచేనున్న విధంబంతయు నాన తిచ్చితి నేనాకాశవాణి వాయువశంబున నిష్ఠీవనంబుగానగోపాలుదోయిటం బడుటంజేసి నీకవశ్యము మరణంబు గలుగనున్నది ముందుగాదెల్పితిని జాగ్ర తతో ప్రవర్తింపుమనిన గయుండు భయభ్రాంతచిత్తుడయి ఆశ్చర్యంబొంది మూర్ఛల మునుంగుచు సంతాపంబున నశరీరవాణితో నిట్లనియె.

ముఖారిరాగం - అటతాళము.

ఇదియేమన్యాయము - నేనొకటెరుగ - అంతలేనిచటుమాయము సదమలమణిమయచారుపుష్పకమెక్కి - ముదముమీరగ నేను - చదలమా ర్గమునసదయహృదయనివాసుడగు విధిసదనముకేనరుగువాడను మదనజనకున కెగ్గుజేయను మదమున నెగమించనాడ॥ ఇది॥ పుట్టినప్పటిదోషమోవుదయ మున లేచినట్టికాలవిశేషమో తెట్టతెగవుయింతపట్టుసంభవమాయె - కట్టా యెవ్వరికాళ్ళుబట్టిబ్రతుకుదును చుట్టుకైదువు చేతనాతలగొట్టితన కోపాగ్ని కాహుతిబెట్టి శాంతుడగుదునని చలముపట్టినాడట నందనందను॥ ఇది॥

నాయందుదయయుంచరా - యెవరయినయుపాయము దొలగించరా - బాయకధరనూళ్ల బాలగోపాలుని - వేయివిధములవేడి న్యాయమంతయుదెల్పి - వాయుచే నిష్ఠీవనము నీదొసిట బడగాస గయుడిట జేయడని కోడూరివోబులరాయ వరదునకెవరు దెల్పుదు॥ రిది॥

వ. ఓ విష్ణుపదవాణి నేను శ్రీకృష్ణమూర్తి కరపుటంబున నిష్ఠీవనంబు చేసిన దుష్టాత్ముండని స్పష్టంబుగా నమ్మివిష్ణుండు తన సుదర్శనాయుధంబున శిరచ్ఛేదనంబుగావించెదనని అతి ఘోరంబగు శాబ్ధిం జేసినవాడంటివి యపకారం బేనెరుంగనే గోపాలుండు పాపపుణ్యంబులు గనుపించక కోపాటోపంబున నన్ను వధించుటకు విధాయకం బౌనా తల్లీ.



కథ.

అకటా నాదుపురాకృతపాపమేమనవచ్చునయ్యో
ఒకదోషము నెరుగనైతి నీవృత్తాంతంబేమో
వేగిలేచి నేనెట్టిఖలులమో మేల్పడజూచితినో
యీగతినాకిటు సంభవించుటకు హేతువేమొకాని
ప్రకటితముగ మాగురునిసాక్షియే పాపమెరుగనేను
సకలధర్మములు బాగుగనెరిగిన సత్పురుషులు ధరలో

కానక జేసిన తప్పుక్షమింతురు కలుషాత్మునినైన
గానలోలు డిపుడింతటి శాబ్ధిబూనినవిధ మేమొ
నందకుమారుడు నన్ను జంపయేనాటిపగలు గలవో
నిందబాపినను రక్షణసేయగ నెవ్వరోపగలరు
ఎవ్వరు నామొరలాలకించగల రెవ్వరు గాచెదరు
ఎవ్వరి కేమనివిన్నవింతు నే నెవ్వరి జేరుదును
యెవ్వరి నేమని నిష్ఠురమాడుదు నెవ్వరిదిట్టుదును
యెవ్వరునను బ్రతికింతురు వగ పెవ్వడు దీర్చెదరు
యెక్కడి చావిది మాయగవచ్చె నిదెక్కడి ప్రళయము మొ
ముక్కవగలమాతల్లితండ్రికే నొక్కకొమారుడను
పంతముతో శ్రీకృష్ణమూర్తి ననుపట్టి వధించినను
అంతరించినే పరలోకంబున కరిగిన నటుపిదప
వారకవెంటనె మణిపురమున కీవార్త దెలసెనేని
సూరిజనాలంకారుడు సత్యాచారు డార్యసముడు
తపముజేసినను గన్నతండ్రిగని తల్లడపాటునను
అపరిమితంబుగ దుఃఖములోతా నపుడు సచ్చునయ్యో
గారవమునను గాంచినతల్లికి గ్రక్కున దెలిసినను
బోరునవగచుచు పుత్రశోకమున బొరలిసచ్చునయ్యో
పదపడి నేమృతి బొందినగతినా భార్య లెరింగినను
యెదనుకరంబుల మోదుకచచ్చుట విదితమైనమాట
గొప్పగబ్రతికిన వారుజచ్చిరని ఘోరముగావగచి
అప్పుడె మణిపుర గంధర్వోత్తము లందరు జచ్చెదరు
నన్ను కృష్ణుడిల గూల్పనిందరికి నాశకారణంబు
పన్నుగనింతకు నిదియెకాక నే బాలవయసువాడ
అన్నయువిమల విభూషణములపై నాశదీర లేదు
దివ్యాంబర వాహనములమీదను దీరలేదు మమత
వగగుల్క స్త్రీసంభోగంబుల వాంఛదీర లేదు
అగణితంబుగా వాంచలుమనమున దగిలియున్నవాడ
ఈధర నెవ్వా రెరుంగని భోగము లేత్తైల నెడబాసి
రాధికనాథుని చేతజావగా వ్రాసినాడో బ్రహ్మ

యేమి సేయగలనూళ్ళపాళెపురి యిందిరేశునాజ్ఞ
నీమనమున తప్పింపగ నంతటి ధీరులెవ్వరిలలో॥

వ. ఓ ఆకాశవాణీ గోకులపాలకుని ప్రతిజ్ఞ యేను శోకవ్యాకుల చిత్తుఁడనై ముందువెనుకలు దోచక డెందంబున గొందలపడు చున్న వాడ నొక్కయుపకారం బొనరింపు మంబా సకలజలఘుట ప్రతిబింబా.

దరువు - శ్యామరాగము - అటతాళము.

ఆకాశవాణి - యేనపరాధినని మ్రొక్కి శ్రీవిష్ణునకుదెల్ప వే॥ ఆ॥
కాకాసురుని నాడు కౌసల్యతనయుడు జోకతో బ్రోవలేదా॥ ఆ॥
పగవానితమ్ముని భయముదీర్చిబ్రోచె - భగవంతుడితడేకాదా॥ ఆ॥
నగజాధిపుని బానుడను దైత్యుడొకమాట మిగిలిన మన్నించడే॥ ఆ॥
వెన్నుడూళ్ళపురిని వెలయుకృష్ణుడు-నిశాబ్ధిబన్నినన్నిలగాల్పగా॥ ఆ॥
మున్నుకోచూరి వోబులరాయనుకే య-న్యాయ మొనరించితి॥ ఆ॥

వ. అని యిట్లత్యంత శోకంబున నడలుచున్న గయునిం గాంచి నభోవాణి యిట్లనియె.

గీ॥ వినుము కృష్ణునకేమని విన్నవింతు । కార్యమేలేదు నీవింక కడు రయమున । బ్రహ్మకడకేగి యాతని ప్రస్తుతింప । అతడు నినుబ్రోచు నీవైరి ప్రతిన ద్రోచు॥

వ. అనిన గయుండు మెన్నం డెరుంగని న్యాయంబేమని కన్నీరు మున్నీరుగా దుఃఖించుచు చిత్తంబు వికలంబుగా తత్తరపాటున నిలిచిన చోట కాలునిలుపక సత్యలోకంబునకుబోయి కమలాసనుని చరణకమలంబులపైఁబడి యిట్లని విలపించె.

కథ.

దేవానాదుభయోత్పాతమును దెల్పెద వినవయ్యా
సావధానముగ నాకర్ణింపుము జరిగిన విధమంత
భక్తిశ్రద్ధమిముపాడి యరుణోదయమున నేలేచి
గగనమార్గమున మీాసముఖమునకు గదలివచ్చువేళ
ఆదేవకివరతనయుడు సూర్యున కర్ఘ్యమొసంగగను
చేదోయిటిలో నిష్ఠీవనమును చేసినా నటంచు
అతడు సుదర్శనమున నన్నిపుడు హాతిమొనరింతు నని
అతి ఘోరంబగు శాబ్ధిజేసినా డనుచు నన్ను బిలచి

సురపథవాణి యిపుడానతిచ్చెను సురజ్యేష్ట వినుము
కరుణతోడ నన్నాదరించి నారాయణుని శాబ్ధిబాపి
ప్రాణరక్షణము జేసెదవని నీపదములపై బడితి
వాణీనాథ నను గావకున్న నిను వదలను నేనికను
అని యీవిధమున గయుడు వగవగా నంబుజాసనుండు
తనమానసమున యూళ్ళపురీశుని తలపోయుచు నజుడు॥

వ. ఇవ్విధంబున గయుండు ఖేదమనంబున పాదంబులు బట్టుకొని లేవకున్నయే నేమి సేయనోపుదు నని మనంబున చింతించి తనకరంబుల నత నికరంబులు పట్టుక లేవనెత్తియుం గాంచి భారతీ మనోహరుం డిట్లనియె.

క థ.



వనికిమాలి నీవేడ్వగ నేటికి వినరా తెల్పెదను
ఘనుడగు నందకుమారుడు నీతల దునుముట నిజమైతె
ఆపరాత్పరుని కడ్డపడగనే నోపజాల నిపుడు
గోపకుమారుని ప్రతినదీర్చుటకు నావని గాదయ్యా
గానలోలు డఖిలాంతరాత్మకుడు దానవసంహారుడు
భానుకోటి సమతేజుడు లీలా మానుషవిగ్రహుడు
అచ్యుతు డీతడు మీనరూపమున అంబుధిలో జొచ్చి

ముచ్చుసోమకునిద్రుంచి వేదముదెచ్చి నాకొసంగె
అమరులకొరకు మహేంద్రము నెత్తిన మకరమూర్తి యతడే
రాత్రించరుని వధించిన వరహావతారుడనగ నతడే
నరమృగరూపధరుం డయి దనుజుని బొరిగొను నాత డతడే
ధరవటుడయి బలి నడగగద్రొక్కిన పరమపురుషు డతడే
భావజజనకుడు నృపులద్రుంచగల భార్గవుడన నతడే
రావణకుంభకర్ణాదుల దునిమిన రాఘవుడన నతడే
చెలగుచు యదుకులమందు జనించిన బలభద్రుం డతడే
బలియుడనగి పొగడొందిన ధన్యుడ బౌద్ధమూర్తి యతడే
కలియుగాంతిమున నవతరించగల కలికిమూర్తి యతడే
జలరుహనాభు డూళ్ళపాళెపురి వెలసినవా డతడే॥

వ. ఓయి గంధర్వరాజా పదునాలుగు భువనంబు లుదరంబునగల మదనగోపాలుని ప్రతిజ్ఞ దీర్ప నెవ్వరోపుదురు అతండు దుష్టనిగ్రహశిష్టాను గ్రహంబునకై ధరణీతలంబున మారకోటి సుందరాకారుండై యవతారం బెత్తిన నారాయణుండు గావున నమ్మహాపురుషుని శాస్తి దప్పింప నావశముగాదు నీ వతిరయంబున కైలాసంబున కేగి శంకరుని వేడుకొంటివేని నతండు నీప్రాణరక్షణం బొనరించునని వెండియు బ్రహ్మదేవుం డిట్లనియె.

దరువు - తోడిరాగము - అటతాళము.

కరమరుదుగ జనిశంకరు వేడరా - మురహరునంతవాడు పురహరుడు గాపాడు॥ కర॥ వారిజాక్షునిప్రతిన వారించురా - వారిద్దరెకారొరులునీకిక॥ కర॥ హితమతినూళ్లపురి శ్రీపతిని జేరి - నుతులతోనై నాయుమాపతి నిను గాంచును॥

వ. అని వనజసంభవు డానతిచ్చిన విని గంధర్వవరేణ్యుం డిట్లనియె.

కథ.

ఇక్కడుండు నీబ్రహ్మను నింతగ మ్రొక్కిన ఫలమేమి
నిక్కముగానను బ్రోవడు నాకిక దిక్కెవరని ఫలమేమి
ఆశనిరాసను జేసికొని గయు డాసమయంబునను
ధారుణీధరబిలమున విమానము దాచిపెట్టి వేగ
గాసిజెందవిధి వ్రాసిననుచు కైలాసంబున కేగి
ఆరజతాచల మెక్కి పుష్పకము నచటడిగ్గి గయుడు

గౌరివల్లభువాసనికేతన ద్వారంబున జేరి
వారకలోపలబోవగ పరిచారులు వల దనగ
ఘోరునవగచుచు గయుడులోనికి బోనివ్వరె యనుచు
హారజతాద్రివిహారకావరా ఆపన్నుడ ననగ
శ్రీకంఠుడు గంధర్వుని దుఃఖము శీఘ్ర మాలకించి
గయురానిండనిభటుల కాజ్ఞశివు డొసగగ నాపైని
రయమున వారా గయునిలోపలికి రమ్మని పిలువగను
గయుడుఖేదమున శివునికొలువునకు గ్రక్కున జనుదెంచి
ఫాలాక్షుని గని ఘోరునవగచుచు పాదములకు నొరిగి
బాలేందుధరు గాంచిగంధర్వుడు బల్కె నిట్టులనుచు
వందనమిదె శర్వాణీ మనోహర వందే త్రిపురహరా
వందనమిదే రజతాద్రివిహారా వందే కలుషహరా
తాండవ కేళివిలాస చండమార్తాండకోటిభాస
కుండలిరాజవిభూష నిఖిల బ్రహ్మాండభాండపోష
భూతములకు నాధారభూతుడౌ భూతగణాధీశ
భూతదయాళుడ వఖలకాయుడవు భూతమయుడవీశ
పొంకముగా సృజియింప హరింపను పోషణజేయుటకై
పంకజసంభవ విష్ణుశివాఖ్యల బరగుచుందు వభవ
పరిజనదురితగాడాంధకార రవిభాసురవరనామ
పరమ యోగిజన మానసకైరవ పర్వాద్భుతసోమ
క్రూరదనుజమహీజంబులకు ధీరమదమతంగ
ధారుణీదుర్భరహరుడ వందురు దర్పకమదభంగ
విపులానంతకల్యాణగుణుండవు వీగపవిత్రుడవు
కపటనాటకసూత్రధారుడవు కారణమాత్రుడవు
పొందుగ నాదిమధ్యాంతశూన్యుడవు భువనమోహనుడవు
కొందరు నీమహిమందురు ధరలో కొందరు కాదనిరి
కొందరు నిను కలడందురు లోకులు కొందరు లేడనిరి
కొందరితడు గుణిగాడని పల్కిరి కొంద రాత్మ యనిరి
కొంద రక్షరుండనుచు వచించిరి కొందరు క్షరుడనిరి

కొందరఖిలమున కీవేకర్త యందురు సర్వేశ
త్రిజగన్నుత యఖిలేశ్వరేశ భవదీయ ప్రభావమున
నిజము దిగానక గజిబిజిపడుదురు ప్రజలు లోకములలో
దీనదయానిధివనుచు నిన్నునే మానసమున నమ్మి
మానక నిన్ను భజించువాడనో మహాదేవా వినుమీ
తలపరానిదొక నిందగల్గి నీదాపుజేరినాను
తెలుపగ నేటికి దివ్యదృష్టిచే తెలిసియుండు నీకు
ఐనను నేనై విన్నవింతు నే డరుణోదయమునను
భానుని కర్ఘ్యమొసంగ శ్రీగోపాలుని దోయిటిలో
గగనమార్గమున బ్రహ్మసభకు నే గదలిపోవు వేళ
పగగొన నిష్ఠీవనమును జేసిన పాపాత్ముడననుచు
ఘనుడగు నందకుమారుడు నన్నపకారిగ భావించి
తనదు చక్రమున నాదుశిరచ్ఛేదన మొనరింతునని
గట్టిగ శౌరిప్రతిజ్ఞను నాపై బట్టినవాడనుచు
గుట్టుగ నంబర వాణిదెల్పె నిది వట్టిమాట గాదు
కృష్ణుని శపథము దెల్పగ విని నే విస్మయ మొందుచును
రయమున కమలాసునికడకు జని రక్షింపుమటన్న
చతురాస్యుడు నాచేతగాదని యతిరయమున నిపుడు
శ్రీకంఠుడు నీప్రాణరక్షణము సేయు నరుగమనిన
నీపదాబ్జములు పట్టినవాడను నీలకంఠ వినుమా
ఆపద దొలగగ ద్రోసి కావుమయ్య ఆర్యమనోరమణ
తడయక కృష్ణుని శాబ్ధిమాన్పి నను దయజూడుము సాంబ
పామరుడను నాతప్పు క్షమింపుము బాలచంద్రమకుట
కామగమనమున వేంచేసి నను గావు మభ్రకేశ
చిత్తము వికలంబైనది చక్కగ జేయుమనలనేత్రా
తత్తరమెల్ల హరింపజేయదగదయ్య కృత్తివాసా
కాచిమదీయపురమునకు నన్నటుబనుపు గరళకంఠా
మరణావస్థను ద్రోచి నావగపు మాన్పు మంగజారి
కరుణ సుధారసవృష్టి దేర్పరా కమలనాభవంద్యా
అరమర చేయక నన్ను బ్రోవవే నరుగుదెమ్ము భర్గా
అవనియాళ్ళపురిశుకృపకేది తగదనుము శూలపాణి
వివరమెరుగ నుతిసేయ మ్రొక్కుగొనవే ప్రణతార్తిహరా॥

వ. అని యత్యంతచింతాక్రాంతుడయి గయుండు తన కన్నీటి ధారచే పురహరుని చరణసరోజంబులు దడపుచు నిట్లని స్తుతియించె.

దరువు - హరికాంభోజిరాగము - ఆదితాళము.

నాగభూషా నతజనపోషా - ఆగమవేద్యనన్నాదరించగదే॥ నా॥
ఆవసుదేవాత్మజుచేత జావకుండగను గావుమీవేళా॥ నాగ॥
దిక్కునీవె దీనదయాళో - నిక్కముహూతల్లికే నొక్కకుమారుడ॥ నాగ॥
లేనిపోనిహాని జనించె - మానక నాకభయదాన మొసగవే॥ నాగ॥
ఇలనుయాళ్ళపురీశుడునన్ను బాలియగజూచె-వోబులరాయసుతుడు॥

వ. ఇట్లు మొరపెట్టుచున్నం గని కరకంఠుడు కరుణాయత్తచిత్తుండై సాదరంబున గంధర్వనాథునితో నిట్లనియె.



దరువు - దర్బారురాగము - జల్వతాళము.

హరిప్రతిజ్ఞ మాన్ప - నెవ్వరితరముగాదయా॥
దరిదోచదికేమి సేతుశరణాగతబిరుదులుగల దొరతాకరుణించక॥ హరి॥
వనజనాభుడాదిపురుషుడనియెరుంగవే - యేనువనజభవుడు మనువులాదిగ॥
విను మావసుదేవాత్మజుని గనుమా కృపగను॥

శ్రీనివాసుడూళ్ళ పాళెగాసలోలుడు పనిబూని - కోచూరివోబయాలి దాసుని సన్మానించిన దీనపరాధీను డయిన॥

వ. ఓయి గంధర్వరాజా శ్రీమదనంతకల్యాణగుణ పరిపూర్ణుండును అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుండును లీలామానుషవిగ్రహుం డగు గోపాలదేవుని ప్రతినమాన్పుటకు యేనును యింద్రాది వనజాసనప్రముఖులును యీ సకలలోకంబులవారును వకగట్టి మొత్తంబయి యమ్మహాత్ముని కడ్డపడినను అతడనంతకార్యంబు జేయువాడని తలంపు మిది నిక్కవంబు గావున నీవతిశీఘ్రంబునజని మదనగోపాలుని పదపద్మంబులుబట్టుక వదలక విదితంబుగా స్తోత్రంబు సేయుచుంటివేని సదయహృదయుండగు శ్రీకృష్ణుండు నీప్రాణరక్షణంబు సేయగలవాడని శంకరుం డానతిచ్చిన విని గయుండు మిక్కిలి ఖేదంబున నిట్లనియె.

కథ.

దేవదేవమహాదేవ సర్వమున కీవె స్వతంత్రుడవు
యీవిధమున మీరానతివ్వ నేనేమి సేయువాడ
ఈశ్వరసంకల్పమునకు మిక్కిలి యేమియు లేదంద్రు
శాశ్వతుడవు ప్రణవస్వరూపుడవు విశ్వాత్ముడవీవు
అథవా నీవు దలంచిన పనికే మరుకార్యముగలదె
ప్రభుడవీవు నను గాచితె నినుగోపాలు డేమి జేసు
ఆపన్నుడనై వేడిన దయరాదాయె నేమిసేతు
నాపూర్వకృత మిట్టిదయో శ్రీపార్వతీనాథ
కైలాసంబున నందినాథుడవు గౌరీవల్లభుడవు
హాలాహలమపు డారగించితి జాలినేలలేదా
వీరభద్రుండని పేరువహించిన ధీరుడ వీవెకదా
త్రిపురవాసులను ద్రుంచిలోకభయమపుడు దీర్చలేదా
తపసియైన మార్కండుని బ్రోచిన ధన్యుడ వీవెకదా
అద్రిజకర్ధాంగంబు నొసంగిన రుద్రుడ వీవెకదా
భద్రగజావిభుడైనట్టి సముద్రుడ నీవెకదా
పంతమెలర్పగ ధీరుడవింతటి పనుల జేసినావె
అంతకంటె ననురక్షణసేయు టతిశయమా నీకు
యెంచిచూచినను బొమ్మను లేలను మంచిదైనగాని
పంచశరుని గురుడూళ్ళపురీశుని ప్రతిన మాన్పుమయ్య॥

వ. అని యిట్లు ప్రలాపించు చున్న గయునితో కైలాసవాసుం డిట్లనియె.

గీ॥ వినుము గంధర్వ యెంతటి పనులనైన। ఆపరాత్పరు ననుమతి నా చరింతు। గాని శ్రీకృష్ణమూర్తిగాని కార్య। మెద్దియును లేదూళ్లపురీశునాన॥

వ. అని మరియు హరిహరాదులకు భేదంబులేదు గావున శంకరుండా గానలోలుని ప్రతినమాన్పుటకు న్యాయంబుగాదు నీవు మురహరు పాలికి బోయి యతని వేడితివేని అమ్మహాపురుషుండు నీప్రాణరక్షణం బొనర్చునని స్పష్టంబుగా దెల్పిన గయుండు రుద్రునివలన యాశవిడచి గంగాధరు మందిరంబు వెలువడి కొంత దవ్వరుగుదెంచి అచ్చట నిర్మలస్థలంబున నిలిచి మణిమంతుని దలంచి తన మనంబున నిట్లని విలపించె.

గీ॥ మూడుమూర్తులు సమమని ముదముతోడ। జనులును సేయుచుందురు చెనటులగుచు। కనకగర్భుడు హరుడును గానరైరి। దనుజసంహరు డెంతటి దండిమగడో॥

కథ.

ఏమికాలగతి సంభవించెనే నెన్నడెరుగ నయ్యో
వ్యోమకేశుడా ప్రతినదీర్చ నే నోపజాలననెను
శివునిమాటవిని నందనందనుని జేరగబోయినను
తవిలినన్నతడు ధారుణిగూల్చుట తథ్యమైనమాట
తామరసాక్షుడు నన్ను వధించుట తప్పదు గాబోలు
ప్రేమతో నేను పెండ్లాడినకాంతలు పెక్కుమంది గలరే
ఒక్కరికన్న యరుంధతి దర్శనమొప్పగ గాలేదా
అక్కజముగనే గట్టినసూత్రము లన్నియు జీర్ణములా
పూర్తిగనైదువతనము లేదుగాబోలు నొకరికైన
మూర్తివంతములుచెడి వైధవ్యము మ్రోయుచున్నవారో
ఐదువతనములేని భామినుల నందరి జతగూర్చి
పాదుకొనగబట్టి బ్రహ్మ అనాథల జేసెనేమో
నేమహిగూలినతదుపరి భార్యలకేమి గతులు గలవో
నామహదైశ్వర్యమునకు యెవడధినాథుడుగా నగునో
యింద్రనగరమున కెనయగు నగర మదెవ్వరి పాలగునో
చంద్రకాంతశిలాభవనము లెవ్వరి స్వాధీనము లగునో

ఖ్యాతిమించు గంధర్వహాయము లే రౌతుయెక్కగలడో
మాతల్లిదండ్రుల కేమికష్టదశ లావహింప గలవో
ఎయ్యెదెవ్విధిజరుగ నున్నదో యెరుగవశము గాదు
అయ్యయొమారుగ మరణముసంభవమాయె ననుచు గయుడు
ధారుణిపై బడి పొగలుచు వేడుచు బోరున వగచుచును
వారక కన్నుల నీరుయేరులై పారె నఘోరముగ
ఆగయు డాగతిఖేద మొందగా నాడకుచంబులును
యోగిజనాంబుధి పూర్ణకలానిధి భాగవతోత్తముడు
జలజసంభవుని మానసపుత్రుడు కలహాభోజనుండు
ఇలను భరతసంగీతశిఖామణి లలితకీర్తిపరుడు
మానకవిష్ణుని పదసరోజమధుపానపరవశుండు
మానితసుందర మైనవీణచే బూని మీటుకొనుచు
హరికాంభోజమహానటభైరవి యారభి దర్బారు
ఖరహరప్రియభోగి శంకరాభరణము సావేరి
భూపాళము మణిరంగుమ్ము కాంభోజితోడినాట
కాపి దేవగాంధారి నీలాంబరి కన్నడ కనకాంగి
మాళవి మలహరి బిలహరి మలయానిలచర నాట
గౌళశుద్ధసావేరి మారువాందోళితోడి శ్యామ
సేనాపతిగమన శ్రమమోహ ధేనుక రత్నాంగి
మానవతి సరసాంగివరుస ప్రియగానమూర్తి యమున
సూరిరంజనీ కాంభోజి కేదారము జంఝూటి
చారుకేశి హంసధ్వని కన్నడ శహన బంగాళ
కోకిలప్రియా పంతువరాళి కుండలి పున్నాగ
శోకవరాళి నాదనామక్రియ శుద్ధబంగాళముశ్రీ
ఇట్లు వనస్పతిమొదలగు రాగము లేర్పడ బాడుచును
కట్లు స్వరాలు లయోత్తము ముదము గానంబులతోను
నారదమునివరు డంబరవీధి విహార మొనర్చుచును
ధారుణిపై బడి యేడ్చుచున్న గంధర్వుని బొడ గాంచి
క్షితినియూళ్ళపురి శ్రీగోపాలుడె హితుడని దలచుచును
అతిరయమున జనుదెంచి గయునితో నమ్మౌని యిట్లనియె॥

గీ॥ అనఘ యెవ్వండ వీవేమిహానిగల్గె । యెటకుబోయెదు చింతించె దేల నీను । యెవరివల్లనుభీతి నీకెట్లు గల్గె । దెల్పు మిక నూళ్ళపురివాసు దేవునాజ్ఞ॥

వ. అనిన విని గయుండు దుఃఖంచుట చాలించి అరవింద సంభవ నందనునకు వందనం బాచరించి యిట్లనియె.



సీ॥ వినవయ్యమునినాథ విన్నవించెదనీకు నున్నవిధంబెల్ల నొప్పుగాను । గయుడంద్రుడు నాపేరు గంధర్వవిభుడను కమలజుసేవకై కదలిపోవ । దేవకితనయుండుదినమణికర్ఘ్యంబు నిచ్చుచోవినువీధి నేను జనుచు । నిష్ఠీవనముసేయకృష్ణునికరమున వాయువశంబునబడుట జేసి। అలగిరోషించికృష్ణుడు అగ్రహమున। యిటుల జేసినదుష్టాత్ముడెచటనున్న । పట్టితెప్పించిప్రాణముల్ బాపకున్న । శౌరికా నని ధీరుడై శాభిజేసె॥

వ. ఈయుపాధి తప్పింపు మని బ్రహ్మారుద్రాదుల ప్రార్థింపగా వారు మావలన గాదు పొమ్మని యానతిచ్చిరి. ఇంక నేనేమిసేయువాడ నని వెండియు గయుండు యిట్లనియె.

దరువు - పూరి కల్యాణిరాగము - ఆదితాళము.

దరిదోచ లేదనఘా నాకేమో పరితాపము భయముదుఃఖము॥ దరి॥
పన్నుగానూళ్ళపాళెముదారి - పన్నినకాశాబ్ధి నాపువారు లేరు॥ దరి॥

వ. అని యిట్లు ప్రలాపించుచున్నంగని నారదుండు కరుణాయత్త చిత్తుండై యిట్లనియె.

కథ.

వ్యర్థముగా నిటుదిరిగినయేమియు సార్థకమే లేదు
పార్థునికడ కరుదెంచి నీవతని ప్రార్థన మొనరించి
విజయుని పాదాబ్జంబులపై బడి విడువకుంటివేని
నిజముగ నాతడు భూతదయాళుడు నిన్ను గావగలడు
హరుడు భూతగణసహితుడగుచు దాననికి గడంగినను
సురగణములతో గూడుక నిర్జరవరు డెదిరించినను
ధీరులు తమతమ పరిజనములతో దిక్పతు లెదిరినను
శౌరిశాబ్ధి గెలిపించభూవరులు దారు గడంగినను
రణమున నిందఱనోర్చి నరుడు నిను రక్షింపగ నోపు
మణిమంతుని వరతనయక్రీడిసమాను లెవ్వారిలలో
త్రిభువనములలో తగశూరుం డన దేజరిల్లె నరుడు
అభవునికృపచే పాశుపతాది మహాస్త్రంబులు బడసె
ఖాండవవనము దహించె గాండివమును బడసె
దండిశూరులగు కాలకేయులను దానవులను గూల్చె
భండనమునరిపుతమసపటల మార్తాండుడు ఫల్గునుడు
చండకిరణదోర్దండవిక్రముడు పాండవమధ్యముడు
కదనోత్సాహుడు ధనుర్విద్యలు ఘటికుడు అర్జునుడు
సదహృదయుడగు శ్రీగోపాలుని సఖు డాయింద్రజుడు
కావున పార్థుడు నీప్రాణంబులు గాచును బొమ్మనగ
దేవమునీంద్రుని జూచి గయుడపుడు దీనత ఇట్లనియె
అనఘా నీవిపు డాజ్ఞ యొసంగిన దంత సరే కాని
ఘనుడగు కృష్ణున కర్జునుండు చెలికాడని పలికితిరి
నన్నుగావు మని సన్నుతించి నేనాతని జేరినను
పన్నుగ పార్థుడు శౌరికియిపుడు నను బట్టియిచ్చునేమొ
ప్రకటితముగ ధరనూళ్ళపురీశుని బాంధవుడే వరుడు
సకలవిధంబుల ననుఫల్గునుడు శౌరికియ్యగలడు॥

వ. అని నమ్మజాల నని విలపించుచున్న గయునితో నారదుండిట్లనియె.

అర్జునుండు నిను రక్షణచేసెద ననుచు బల్కెనేని
దుర్జయుడై యున్నతకార్యమును దొడరించును గాని
ధారుణిఁ గ్రమ్మింగిన యాడినమాటను తప్పడు ఫల్గునుడు
సారసనాభుని ప్రతినదీర్చి నిను సత్కరించు ననిన
నారదుతో గయుడిట్లని పల్కెను నమ్మవచ్చు ననుచు
వారిజగర్భుని వరకుమార నేనిజముగ నేగెదను
సచ్చరితుండగు పాండవమధ్యము డెచ్చట నున్నాడు
చెచ్చెరగదెల్పు మటన్నగయునితో చెప్పదొడగె మౌని
ఇప్పుడు సతిసోదరిహితంబుగ నింద్రతనూభవుడు
ఒప్పుగ ద్వైతవనంబున చెలగుచు నున్నవాడు ఘనుడు
తడయక నీవరుదెంచి ఫల్గునుని దాపున జేరినను
కడిగియూళ్ళపురి శౌరివోర్చినిను గావగలం డతడు॥

వ. అని బోధించి యతని నొడంబడజేసి యర్జునునికడకు బొంబనిచి నారద మునివరుం డరిగి తదనంతరం బాగయుండు ద్వైతవనంబున కేతెంచెనపుడు.

క థ.

మేరుధరాధరధీరుడబ్ధి గంభీరుడమితబలుడు
శూరుడు సుందరాకారుడు పాండుకుమారుడు ఫల్గునుడు
చండకిరణసమ సుందరరూపుడు దండిగ మెరయగను
గాండీవము చేబూని భుజంబున కవదొనలొప్పగను
తిపసునివిధమున దేజరిల్లుచును తానపు డర్జునుడు
అపుడు దైవయోగమున వేలసన్న్యాసముగా రాగా
గయుడుచూచి యాశ్చర్యమంది యీఘనుడు డెవండనుచు
నయముగ నాత్మలో నిట్లనితాను నగుని వితర్కించె
హారుడో భాగతి వరుడో మందరధరుడో యీఘనుడు
మరుడో నలకూబరుడో చంద్రుడో హరిహాయుడో యితడు
అతివిశాలవక్షంబు నాయతాజానుబాహువులును
నతిరమ్యంబగు సౌందర్యంబును నౌరధైర్యమహిమ
ధరలోనితని బాహువీర్యమును తగుగాంభీర్యమును
అరయనింతటివానిగా గని యఖిలలోకములలో
ఘోరదరిద్రుడు నిక్షేపము గనుగొన్నవిధంబునను

ధీరునిగాంచితి ప్రాణభయంబులు దీరిపోవునటుల
నిక్కముగా నితఁడెవ్వఁడయినది నిశ్చయమే నెరుగ
అక్కజముగ నేగంటి నూళ్లపురి హరినిగన్నరీతి॥

వ. అయినను పాండవమధ్యముఁడా యని నిశ్చయించుటకు నతండు మానవమాత్రుఁడాయెనే యిమ్మహాతేజం బతనికి కలదా యితండు త్రిపుర సంహారుఁడు గాబోలు నని మఱియు తన మనంబున నిట్లని తలఁచె.

సీ॥ పురవైరి యితఁడైన భోగిహారము లెవ్వి హరుఁడుగాఁడీతఁడు నరుఁడుగాని। శ్రీనాథుఁడితఁడైన శ్రీవత్సమూ లేదు వరముర హరిగాఁడు నరుఁడుగాని। వేల్పేశుఁడితఁడైన వేయికన్నులు లేవె హరిహయుండునుగాఁడు నరుఁడుగాని। చిత్తజుఁడితఁడైన చెఱకువిల్లును లేదు మరుఁడుగాఁడీతఁడు నరుఁడుగాని। ధనువు శరములు చేపట్టి దనరినాఁడు। నివురుగప్పగ భాసిల్లు నిప్పు యనఁగ। సమరవిజయుండు సాహసచక్రవర్తి। మహినియూళ్ళపురీశుని మఱిది యగును॥

వ. కావున నిక్కంబుగా నిమ్మహాపురుషుం డర్జునుండు మదీయ ప్రాణరక్షణ సేయఁగలఁడని యెంచి త్రిదివేశ్వర తనూభవుం డగు పార్థుని గదియం జేరి యెదుటనిలచి యంజలిబద్ధుం డయి యిట్లనియె.



దరువు ముఖారిరాగం - అటతాళం.

శరణు ధరణీనాయకోత్తమ శరణుకృష్ణసఖానుసత్తమ
అర్జునా కలుషవిసర్జనా॥ శరణు॥
ప్రాణమైనయొసంగిధర నాపన్నులనురక్షింతు
వనుచు వింటినీ వేడుకొంటినీ॥ శరణు॥

సాహసంబున వితరణంబున బాహుబలమున
  నీసమానులు లేరట పోరుకు రారట॥ శరణు॥
సంగరోత్సాహుడవు శస్త్రాస్త్రము లనేకములున్న
  ధీరుడ వందురూ పొగడుచు నుందురూ॥ శరణు॥
నూళ్ళపాళెము రారి యగు కోచూరి వోబులరాయు
  సుతునకు మరిదివీ శ్రీదాశరథివీ॥ శరణు॥

వ. అని దుఃఖించుచు గయుండు భయభ్రాంత చిత్తుండునుం బోలె నప్పుడు.

కథ.

ఖేదముతో గయుడప్పుడు పార్థుని పాదములను బట్టి
ఆదరించి నాప్రాణరక్షణం బాచరింపు మనుచు
పదములపై బడిలేకున్న నాఫల్గుణు డిట్లనియె
వదలక శరణాగతుడ వైతి వెవ్వడవో తెల్పుమయ్యా
యెవ్వరు యేమపకారము మొనర్చిరి యేమనిరి నిన్ను
యెవ్వరు నిను దూషించిరి రణమున కెవ్వరు దలపడిరి
యెవ్వరునిను నపాయుని జేసిరి యెవ్వరు గన్పడిరి
యెవ్వరునిను బెదరించిరి ద్రోహము కెవ్వరు పాల్పడిరి
యెవ్వరు నినుశపించిరి యీవైరపెవ్వరిచే గలిగె
నివ్వసుమతిలో నంతటి మొనగా డెవ్వడో తెల్పినను
అట్టివానిని దండించెదను దిట్టతనంబునను
అట్టహాసముగ మార్కొని పోరుదు నమరేంద్రుం డైన
బాయక నినునే గాచిరక్షణము జేయువాడ ననఘ
నీయుపాధి యిటుదెల్పుము లెమ్ము నీకుభయం బేమి
శరణన్నను పగవాని నయిననే సరవితోడ బ్రోతు
గురుతరముగ నెరనమ్మినవారిని జెరుచువాడగాను
కాదని బ్రహ్మేంద్రాదులు మార్కొని కలహించిననోర్తు
నాదరి జేరినవారి కెన్నటికి నాశము లేదయ్యా
ఘన మగు కులగోత్రము లెయ్యది జననీజనకు లెవరయ్యా
అనఘా నీపుర మెయ్యది పుడునీ మనసు నొచ్చనేల

ఇంతిభీతి నీకేలగలిగె నిటు చింతిల నేమిటికి
అంతయుజెప్పుము నాకడనీవు కొరతబెట్టవలదు
కాళ్ళువిడచి నీభయోత్పాతమును గ్రక్కున దెల్పినను
వ్రాళ్ళపాళెపురిశౌరిసాక్షిని నొప్పగ గాచెదను॥

వ. అని ధనంజయుండు బల్కిన విని గయుండు లేచి ప్రియంబందుచు నంజలీబద్ధుండయి యెదుర నిలచి యిట్లనియె.

క థ.

వినుమునాదు పూర్వోత్తరంబులను విశదముగావింతు
పదివిధంబుల గంధర్వులు గల వంశవర్ధనుడను
మనుజనాథ నిషదాద్రియందు గల మణిపురవల్లభుడు
ఘనుడగు మణిమంతుని కుమారుడగు గయుడందురు నన్ను
అందమయిన యాగంధర్వులకే నధినాథుడ నయ్యా
పొందుగ నిరతము బ్రహ్మకొలువునకు బోవుచున్నవాడ
మానక యెప్పటి యట్లనె దివ్యవిమానముపై నెక్కి
యీనిశి వేకువజామున లేచి వాణీశుని కొలువునకు
గగనమార్గమున బోవుచుండగా కాలడుగకు సరిగ
నగధరు డర్కున కర్ఘ్య మొసంగగ నతనికై పుటమున
అప్పుడు నిష్ఠీవనముచేసి తన అగ్రహమును గొంచు
తప్పక శ్రీగోపాలుడు మండుచు ధరణి చలింపగను
చక్రముచే నాశిరముద్రుంతు నని శాబ్ధిజేసెనంత
అదివిని నేనపు డమితభయంబున నడలుచు నేతెంచి
విధినిజేరి నాకభయమొసగు మని వేడుకొన నతండు
హరి ప్రతిజ్ఞ నేమాన్పజాల పురహరునిజేరు మనెను
పరగవిధాతృనివలని యాశనే బయలు పెట్టినేగ
శితికంఠునిదరిజేరి కావుమని నతులొనరించినను
శౌరిప్రతిన నే మాన్పలే ననుచు నిట్లు బల్కెనయ్యా
అంతశంభుడు నన్నుగావడని యాశవిడిచి నేను
అంతరంగమున వగచుచు నడవుల కేగుచున్న వేళ

విజయుండర్జును డతని జేరనీ భయముతీర్చు ననుచు
తాపసేంద్రుడిటు దెల్పగ విని నీ దాపుజేరినాను
బాపనందనా నిన్ను జూడనా పాపమెల్లదొలగె
మత్తగజారిబలుండవు మేరుసమాన ధీరుడవ్వగా
చిత్తమలర నను గాచెద నని వాగ్దత్తము జేసితివి
గొప్పవాడ విటు లాడి మాటను తప్పబోవు నీవు
ఒప్పుగనీకడ బ్రతికెద నాకు భయోత్పాతము లేదు
సాహసమునధర నూళ్ళపాళెపుర శౌరి ప్రతిననీదు
బాహుబలంబున జెరుపనోపుదువు పాండుకులాభరణా॥

వ. అని యిట్లు గయుండు తన వృత్తాంతం బంతయు తేటపడం దెల్ప నర్జునుండు డోలాయమానసుం డయి నిజాంతర్గతంబున.

దరువు - హరికాంభోజిరాగము - రూపకతాళము.

ముందు హేమ్య మెరుగక నే మోసపోతిని
మందమతిని యభయమిాక మాననైతిని॥ ముందు॥
మజ్జగంబు లోక్కపెట్ట మోహరించునా
అజ్జనార్దనునకుపిప్పి వాయయానము॥ ముందు॥
అట్టిశౌరితోడ సాహసము గల్గెనా
యిట్టివేళ నే జయించెదేమొ తెలియదు॥ ముందు॥
అదియుగాక శౌరి మాకు ఆపద్బాంధుడే
మదనగురుడు జేయు మేలు మఱువవచ్చునా॥ ముందు॥
అపుడు మానభంగిమైతి ననుచు వేడినా
ద్రుపదరాజ సుతనుగాచె దురితదూరుడు॥ ముందు॥
అక్కజముగ మఖ్ఖునపుడు లక్కయిండ్లలో
నృక్కణంగకుండ గాచి చక్కజేయడే॥ ముందు॥
క్షితినియూళ్ళపుర మురారి ప్రతినమాన్పగా
శితికంఠాదులోపరేను జేయువాడనా॥ ముందు॥

వ. వీని రక్షించెదనని ముందు వాగ్దత్తమనోద త్తంబులు జేసినదెంత కారణం బాయె నక్కటా యిపుడు నేనాడిన మాట దప్పితినేని లోకులు నన్ననృతవాది యని నిందింతురు యీ యపవాదంబుకంటె ప్రాణంబు లైనను త్యజించి గయుని గాచుట కర్తవ్యం బని నిశ్చయించి ధైర్యం

బవలంబించి పార్థుండు గయుని దోడ్కొని ధర్మరాజు కడ కేతెంచినం గాంచి యతం డిట్లనియె.

ఏరా తమ్ముడ పార్థ యేమిటియొక తిరుగ నున్నావే
వారిజన్మమగు నీదేహము వాడియున్న దేమి
పున్నమ చందురు బోలువదన మదిచిన్నబోవు టేమి
యెన్నడు లేదే ఖిన్నుడవై నీ యున్న హేతు వేమి
ఖాండవమేర్చిన నాడు నీమనసు కలతజెంద లేదె
భండనము లనేకము లొనర్చితివి బడలికైన లేదె
ఖ్యాతివహించిన శూరాగ్రణి వీరీతినుండు టేమి
ఈతడెవడో నీవెంటవచ్చుటకు హేతువేమొ చెపుమ
అని యీవిధమున బల్కిన కౌంతేయాగ్రజు బోడగాంచి
వినయముతో నమస్కారమొనర్చుచు విజయుఁ డిట్టులనియె
మనుజనాథ గంధర్వుం డితడు మణిపురవల్లభుడు
అనఘాత్ముడు మణిమంతుని సూనుం డమిత బలాఢ్యుండు
తాలిమిగల్గిన వాడుయితని యభిధానము గయుడంద్రు
కాలకర్మగతి వలన నీతనికి గల్గె ప్రాణభయమూ
ధరనునూళ్ల పురి శ్రీగోపాలుని కరుణలేమి జేసి
దరిదోపక ననుగావు మనుచు నా దాపు జేరినాడు॥

వ. అన్నా యీ గయుండు తన భయోత్పాతంబు హరితో దెల్పక ముందె నాపాదంబులపయిబడి నాకభయదానంబొసంగుమని ప్రలాపింపగా నేను మెరుంగకయును రక్షించెద నని వరంబొసంగితి యిప్పు డితని నవిస్తారంబు వినగా యితం డమార్గంబున బ్రహ్మసభకు బోవుచున్న సమయంబున శ్రీకృష్ణుండు సూర్యున కర్ఘ్యం బొసంగుచుండగ నతని కరపుటంబున గయుండు నిష్ఠీవనంబు జేసినా డని గోపాలుండు కలుషించి సుదర్శనాయుధంబున వీని రూపుమాపెదనని ప్రతిజ్ఞ జేసినాడట తద్వృత్తాంతం బాకాశవాణివలన విని గయుండు భయభ్రాంతుం డయి హరిహరాదుల కడ కేగి నన్ను రక్షింపు డనిన వారు మే మోపజాలమని పనిచిన జనుదెంచి నన్ను వేడుకొన నే నభయం బొసంగితి నని వెండియుం బార్థుడు ధర్మరాజులతో నిట్లనియె.

గీ॥ గయునిరక్షణమున కమలాక్షునకునాకు। కలహకారణంబుగలిగె నకట। ఇతడుప్రాణభీతినే తెంచియున్నాడు। అతడునిక్కువముగనాపుత్రుడకట॥

వ. ఈ ధర్మసందేహంబు తేటపడం దెల్పు మని పార్థు డడిగిన ధర్మజుం డార్తజనసంరక్షణుండు గావున దయాపరమూర్తి యై యి ట్లనియె.



కథ.

తమ్ముఁడ మిగిలిన పనికినింతగా తరచగ నేమిటికి
నమ్మినవారిని జెరిచినవారికి నరకము ప్రాప్త మగుర
నీచుడు నిర్భాగ్యుండని లోకులు నిందయొనర్చెదరూ
గాచెద నని మాటాడితప్పినా కలుషమమోఘముగా
శూరుడైన వాడవనిలో ప్రాణము చూరబోయిన గాని
వారనిభయమున శరణుజొచ్చినవాని విడువడోయి
అదియుగాక నీవాహవశూరుడ వమితబలాఢ్యుడవు
విదితముగాధర నూళ్ళపురీశుడు విన్న మెచ్చునటరా॥

వ. అదియునుం గాక గోపాలదేవుం డెల్లప్పుడును మన సంరక్షణ నాచరించువాడే అమ్మహాత్ముని దయవలననే మన మింతవరకు సురక్షిత ముగా నున్నవారము. అయినను ఆపన్నుడయిన వానిని రక్షించెద నని ఆడితప్పుట ధర్మముకాదు. వంశక్షయం బయినను గయు రక్షణం బొనర్చు టయే కర్తవ్యం బని ధర్మజభీమార్జున నకులసహదేవులు గయుని సంతోష చిత్తుం గావించి యతని గాచుకొని రట్టియెడ.

క॥ దురాత్మునిగయుని సునా।సీరసుతుం డాదరించి చేకొనెననుచున్ ।
నారదమునిదెల్పగ విని । ధీరుడు వ్రాళ్లపురివాసుదేవుం డచటన్॥

క థ.

వేగవంతుడను నిజభటోత్తముని వేగమె రప్పించి
ఆగమవేద్యుం డిట్లనిపల్కెను ఆరనిరౌద్రముతో
నాకపకారము చేసినదుష్టుని నయముగ మన్నించి
పాకవైరి సుతుడాదరించి తాగావగలనటంచు
అభయమిచ్చి నా ప్రతినజెరుపగా నతడు బూనె నకటా
అభవుడు భూతగణంబులతో తా ననికి గడంగిననూ
నేనుదలంచిన పనివారింపగ లేదునిక్కువముగా
మానక యఖిలజనంబు లొక్కటియొగి మార్కొని పోరినను
గట్టిగ నేమది దలచినట్టియిన పొట్టసమానులును
ఇట్టివాడనని యెడు నటుపార్థుడు పొట్టక్రొవ్వుచేత
మట్టుమీరి కలహంబున నను బరిమార్పగ బూనెనట
చుట్టముదానై నన్నుగొప్పలో బుట్టినవా డితడు
మంచిదికానీ వేగవంత నీవంచితముగ నేగి
మంచితనంబున గయునివిడువు మని మఘవుని సూనునితో
వొప్పదెల్పుము నీతోనిచట నే సెప్పినవిధమంత
తప్పక మేలు గ్రహించి విడిచెనా ధన్యుడె ఫల్గునుడు
విడువకయుండిన వానికి మాకిది కడపటిదిన మనుచు
తడయకనిటుబోధింప జనుమా నే గడడనింక ప్రతిన
ధరను నూళ్ళపురి శౌరినను చు గుత్తెరుగక యింద్రజుడు
నరునితోడ నలధర్మరాజు తా నరసిచెప్పడే మొ॥

వ. వేగవంతా మత్కరపుటంబున నిష్ఠీవనంబు వైచిన దురితస్వాంతు డగు గయుని కభయంబిచ్చి రక్షింపబూని మత్ప్రతిజ్ఞాభంగంబు జేసి నన్నవ మానించుట తగవుగా దని పార్థునితో గయుని విడువు మని నిక్కంబుగా దెల్పుమనిన వేగవంతుం డతివేగమున ద్వైతవనంబునకు యేతెంచియచ్చట పార్థుం గాంచి యిట్లనియె.

ఉ॥ పాండవమధ్యమా వినుము పన్నగ రాట్ఛయనుండు చక్రిబ్ర।
హ్మాండమహోదరుండు పరమాత్ముడు సర్వజగద్గురుండు మా

ర్తాండసుధాకరాక్షుడు విధాతగురుం డనురాగశాలి వే ।
దండహితుండు నూళ్ళపురి ధాముడుకృష్ణుడు బంపవచ్చితిన్॥

గీ॥ అనఘ నిన్నేమిపనికినై బనిచినారు । అచట బలభద్ర గోపాలు రాదిగాగ । బంధుజనులెల్ల క్షేమమా ప్రకటితముగ । ధరను నూళ్ళపురీ శునికరుణతోను॥

వ. అనిన ధనంజయునిం గాంచి వేగవంతు డిట్లనియె.

కథ.

అందరుక్షేమమె కాని వినుము సంక్రందనవరతనయా
నందనందనుని ద్రోహముజేసిన గంధర్వాధముని
పట్టిచక్రమున శిరముద్రుంతు నని ప్రతిన బూనినాడు
అట్టిశాబ్ధివెరవకున్న చక్రాయుధమున నతడు
జననాథోత్తమ యువ్విధిజరిగి జాయెమగనీవు
పన్నుగ నాగయుడరుదెంచి నీపదములపై బడగ
మన్ననతో శిక్షింపమానితివి మంచిదిగా దదియు
ననధిమంతుడగు నందకుమారుడు నగధీశ్వరుడయ్యా
మగనిగోదరుడు కృష్ణుడుసాక్షా ద్భగవంతుండయ్యా
అతడు మీపాలికి యెల్లప్పుడు ఆపద్బాంధవుడు
ఖ్యాతిగ మీకొనరించినమేలది మీతో జెప్పనేల
సంగతిదెలియని వాడవుగావు ప్రసంగమిదేమిటికి
అంగజజనకుడు బన్నినశాబ్ధియు భంగము జేసినను
వారికి నీకును ఘోరఘోరముగ పోరునిక్కమగును
శౌరిసిమీరు జయింపగజాలరు సామాన్యంబుగను
కావునకారణ మంతదెలుసుకొని గయుని విడువరయ్యా
ప్రావీణ్యంబుగ నూళ్ళపాళిగోపాలుడు కరుణించు॥

వ. అని యిట్లు గయుని విడువు మని వేగవంతుండు బల్కిన పార్థు డిట్లనియె.

కథ.

అప్పుడు ప్రాణభయంబునవచ్చిన నతని గాతు ననుచు
యిప్పుడుచంపు మటంచు విడుచుట యేమి ధర్మమోయి
గోపాలుడు జగదీశ్వరు డతనికి కోపము వచ్చినను

నా ప్రాణములతో గయుని విడువ నిక నమ్ముము నిక్కముగ
నందకుమారుడు మాకు బాంధవుడె సందియంబు లేదు
మందరధరుడు మమ్ము రక్షించిన మాటనిక్కమేను
వేడగ నార్తుని గాచెద నని మాటాడితి ముందుగను
ఆడినమాటయు దప్పుజాల నిక ఆడికపాలగుదు
అని యీవిధమున నిశ్చయంబుగా నాడిన పార్థునితో
మనవిరీతిగా వేగవంతుడు మరియు నిట్టులనియె
ఘనుడవు నీతో జెప్ప సమర్థుడగాను యింద్రతనయ
వనజదళాక్షుని మహిమ నెఱుంగని వాడవు నీవయ్యా
అమ్మహాత్మునితో నీ వేమన్నావనుచు విన్నవింతు
కమ్మదెల్పుమటన్నదతనితో గాండీవిట్లనియె
వేగవంత మా బావగారితో వేరు చెప్పనేలా
యీ గయునింకా విడువను శ్రీగౌరీశుని సాక్షిగను
వొప్పుగ చిరకాలంబున మనసు వొంద గాచినాడు
యిప్పుడటువలె కరుణజూడు మని వొందగాచినాడు
యిలను వృాళ్ళపురి శౌరికి నాపై చలము మాను మనుము
కలత మాని గంధర్వుని నన్నును గారవింపు మనుము॥

వ. అని యిట్లు పార్థుండు గయుని విడువక తగు సమాధానంబులు జెప్పి పనుప నావేగవంతు డతిత్వరితగమనంబున ద్వారకానగరంబున కేతెంచి యచ్చట గోపాలదేవునిం గాంచి యిట్లనియె.

గీ॥ వనజనాభ నీవు పనుపగ నేజని । విజయు జేరి గయుని విడువుడనిన। అతడు హరిహరాదు లనికి గడంగిన । గయుని విడువననుచు కనలి పల్కె॥

వ. అనిన కృష్ణుడు దందహ్యమాన మానసుం డయి చటులకోప స్ఫూర్తినిగుడ అట్టహాసంబున దట్టించి యిట్లనియె.

కథ.

మదముకన్నులకు దొట్టియింతగా బొదలుచున్న వాడూ
యెదిరిలావు తనలావు దలంపక వదరుచున్న వాడూ
నాకు రౌద్రమావిర్భవించినను లోకములాగవుగా
శ్రీకంఠాబ్జభవాదులయిన యొక తాకుగాగగలరె
యెంత వీని లావెంత వీనిబ్రతుకెంత భవిష్యమెంత

పంతముతో నేచక్రాయుధమును బనిచి యీక్షణమ్మే
అతనితడుగాచినగంధర్వుని యతని బాంధవులను
హతముజేసి రాగలదు యిపుడు నేనట్లు దలచలేదు
బంధుభావమూహించి నయోక్తితో పార్థుని మన్నించి
గంధర్వుదునిమి నాదుప్రతిజ్ఞ గడుప దలంచితిని
క్రొవ్విన మెకము మోహరించి యొకకొండ నేమిసేయు
బొవ్వసదుమికియు సారమేయమిక కపుడేమిజేసు
హరిణపోత మొకసింహముమీదికి యడరి యేమిచేయు
గ్రుడ్డివాడు మూర్ఖమున పేరడవి కడ్డము పడురీతి
యెడ్డెమనుష్యుడుబోలి నరుడు నన్నెరుగని విధమునను
చెడ్డతనంబున నాదుప్రతిజ్ఞను జెరుపనున్నవాడె
అడ్డిలేక వీడంతటివాడు నొడ్డారించినను
యేనుసూళ్ళపురి శౌరిననుచు గుర్తెరుగడ యింద్రజుడు
ఐనకాని మరి కొంతదూరము విదానించిన తెలియుఁ॥

వ. అని యిట్లు నవనీతచోరుడు సవరణగా బల్కి యచ్చట ప్రవిమలచిత్తుడగు యక్రూరుని పిలిచి యిట్లనియె.

క॥ నాతారతమ్యమునుయీ । భూతలజన తారతమ్యమును నెరుగుదువా । శ్వేతవాహానునికడకుఁ । నీతితో గయునిందుదేగ నీ వరుగవలెఁ॥

వ. అని శ్రీకృష్ణుం డానతిచ్చిన విని యక్రూరుండు వాయువేగంబున ద్వయితవనంబు కేతెంచి సతీసోదర సహితంబుగా నున్న పాండవాగ్రజుం గాంచి యతని కుశలవార్తల కానందించి అచట రామకృష్ణాదుల కుశల సమాచారంబు లుపన్యసించి గాండీవి నొక విజనస్థలంబునకు రావించి యక్రూరుం డిట్లనియె.

సారవిచారా యెన్నడు లేదే కారణ మిదియేమి
వారిజనాభునితోడ నీవడరి పోరిజయించెదవ
అమ్మహాత్ము డఖిలాండకోటి బ్రహ్మాండమహోదరుడూ
ఇమ్మహిదుర్భరమెల్ల హరింపగ నిందిరవల్లభుడూ
ధారుణిస్థలిని కృష్ణుడనగ నవతారమెత్తినాడూ
క్రూరులయిన కంసాదిఖలులను గూల్చినట్టివాడూ
అదియుగాక నీవాహవ శూరుడ వని ప్రసిద్ధుడవె

సదయహృదయుడయ్యెను నతండు నీ సతికి సహోదరుడూ
అట్టివాని నపకారము జేసిన దుష్టుని గాచెదవ
ఘట్టుమీరి నిఖిలేశ్వరుని మార్కొన దలచితివ
నిర్మలాత్ముడవు ధైర్యధనుండవు నీవుకోవిదుడవు
ధర్మాధర్మము లెరిగినవాడవు ధరయశోధనుడవు
శౌరితోసరిగా ననయము నెనగుచు చెలగుచుందు వీవు
వారక నిరతము హరిపదభక్తిని గోరుచుందువీవూ
గయునిరక్షణము బూనిచక్రితో కలహించితివనీ
జయముగల్గ దని నిజముగు రెరిగియు గయుని విడువుమోయి
గడువడి గంధర్వునియిటు దోలిన ఘనత గలదు నీకు
విడువక నూళ్ళపురీశుడు కరుణతో విశ్వసించు నిన్ను॥



వ. అక్రూరుం డిట్లు బల్కినవిని పార్థుండు నిశ్చయార్థంబుగా నిట్లనియె.

కథ.

ఏమోకానీ గయుని విడువనిక సాధ్యంబుగను
నేమున్నరుగక యీతనిరక్షణ మేర్పడ బూనితిని

చాటునవచ్చిన వానిగావక చావ జూడదగున
మాటదప్పినే శాశ్వతంబుగా మహిలో బ్రతుకుదున
ఇలలోశిబియొక పక్షిని దాకరుణించి కావలేదా
అని విభీషణుని రామచంద్రు డపు డాదరింపలేదా॰
శరణాగతులను రిపులకొసంగిరె జననాథులు మున్ను
నెరనమ్మిన శత్రువునునైననే జెరుచువాడ గాను
నాపయిగల్గిన కరుణ గయునిపై నేపారగ నుంచి
ఈపంతముడిగి గయునిపయినిదయ నేపారగ నుంచి
ఆనళినాక్షుడు నూళ్ళపురీశుడు అప్పుడె మాకతడు
ఐనను శరణాగతుని విడువనిక కానిమాట లేల॥

వ. ఓయి యక్రూరా శ్రీకృష్ణుం డఖిలాండకోటి బ్రహ్మాండనాయకుం డనంతకల్యాణపరిపూర్ణుండు సాక్షాత్ జగదీశ్వరుఁడే అయినను ప్రాణభీతిచే వచ్చి ప్రలాపింపగా గయుని రక్షించెద నని వాగ్దత్తము జేసియుంటి గావున నాప్రాణాంతమైన నా గయుని విడువనని యూనిపల్కిన పురుహూతసుతుని గాంచి వీనితో నిక సంభాషింప నలవిగాదని యక్రూరుం డతి త్వరితగమనంబున ద్వారకానగరంబున కేతెంచి శ్రీకృష్ణునింజేరి పార్థునితో తాను సంబోధించిన తెరంగును అతండు తనకు విన్నవించిన విధంబును దెల్పిన విని కైటభాంతకుండు తన సోదరియగు సుభద్రనుగాంచి యా నారీశిరోమణితో నిట్లనియె.

దరువు - జంఝూటిరాగం - అటతాళం.

అంగనరో నీపతినాదు ప్రతిజ్ఞా, భంగము సేయనుపాల్పడెనమ్మా యింగితవేది వేర్పడ తెల్పెద మంగళాంగిరో వినుమా విధమంతా॥ అంగ॥

పొంగుచు నేను నభోమణికర్ఘ్య మొసంగితినిగా నడుసమయమునందు నింగి నేగుచు నాపయివైచిన దొంగకు పార్థుడు దోడ్పడెనమ్మా॥ అంగ॥

నాకపకారినిదాకరుణించె, ప్రాకటముగాగయుని గాపాడనయిరిసూనుడు మందుడయినన్ను నిరాకరించుటను వివేకమా॥ అంగ॥

జోకతోడ మాళ్లపురీగోపాలుడు, నేకనువిచ్చిన లోకములాగునే, కోకిలవాణిరో కోమూరివోబయ నేకముగా నేలిన॥ అంగ॥

వ. చపలాత్ముండగు గయుని మదీయ సుదర్శనాయుధంబునశిరచ్ఛేదనంబు గావించెద నను ప్రజ్ఞ యుంచినట్టి ప్రతిజ్ఞ జెరచి మనోహరుండయిన పార్థుండు గంధర్వుని రక్షింపబూనెనటా అతిశీఘ్రంబున జనుదెంచి.

తెల్పవె నీనాథునితో - అల్పుని విడుమానీ
కల్పముఖై నాకీర్తిని - నిల్పవమ్మాసోదారి॥ తెల్పు॥
వింటాడో వినడో చెంటానంటి బోధించినా -
తుంటారినైనా బ్రోచెదనంటే - మాటాదప్పడే॥ వింట॥
మాటాతప్పలేడే నని మచ్చారించి బల్కినా
కైటభారికి నీకును కయ్యామే నిక్కామని॥ తెల్పు॥
కయ్యమంపె కాలూద్రవ్వె - గవ్వానినే వేరుగానే
అయ్యయ్యో పరువుకై ప్రాణహానికోర్చి పోధీరుడే॥ వి॥
హానికోర్చి నీనాథుడూ కానివాని గాచితే
నేనేగాశక్తిహీనుడమైన వాదమేటికే॥ తెల్పు॥
వాదమేమీలేదేనునితో దాదివయినందూకూ
నాదుప్రార్థనాగైకొని నాథుని మన్నించుమా॥ విం॥
మన్నించితి నింతాసేపూ నిన్నుజూచి చెలియలా
పన్నగబ్రహ్మ లడ్డపడినా విడుతువా నేటికే॥ తె॥
యంతమేలామాను యాళ్ళపాల శ్రీగోపాలానీ
యంతవాడే కోచూరి పోబయాఖ్యవినుతామరదీ॥ విం॥

వ. అని పల్కుచున్న సుభద్ర నొడంబరచి బంగారు పల్లకి దెప్పించి యా శృంగారవతి నందు గూర్చుండ నియమించి తత్పల్లకి ద్వైతవనంబున నున్న పాండవేయులయొద్దకు మోసుక బొమ్మని ధీరవర్యులగు కావర్ల నియమించి తోడ వనచారికవతం బరుగంబంచె తదనంతరంబా.

## కథ.

దీవిలసితమావతి సుభద్రాదేవి రయంబునను
ప్రావీణ్యంబుగ కృష్ణు డనుపగా బంగరుపల్లకిలో
సలలితంబుగా గూర్చొని వనములు చయ్యన దాటుచును
కొల్లలుగా నతిఘోరదుర్గములు కొండలన్ని దాటి
రమణీయంబగు ద్వైతవనమునకు రయమున నేతెంచి
కమలాకరములు కొండలు వాగులు ఘనమగు వృక్షములు
పనసజంబు జంబీరవృక్షములు బదరీభూజములు
ఘనసారంబులు ఖర్జూరంబులు వనకాంచన తరులు

మాతులుంగహింతాలరసాల తమాలవృక్షతతులు
చూతకేతకామ్లాత భల్లాతవృక్షతతులు
కుందకురంట భల్లాతభూజములు కోవిదారతరులు
కందరాళములు సింధువారములు కదళీఫలతరులు
మందారంబులు పారిజాతములు మదనమహీజములు
చందనమరువక మల్లికతరువులు చంపకవృక్షములు
పొందుగ ఫలోపేతంబయి భూజము లొప్పగను
అందమైన కాంతారమధ్యమున నతిమోదంబునను
అందమున దాబోవుచున్నది యాసుభద్రదేవి
కొందరు పరిజనములు జనకుని నందనులున్న యెడ
గనుగొనిరమ్మని పనిచినవారలు గ్రక్కున జనుదెంచి
అనతిదూరమున పాండవులున్నారనుచు వచ్చి దెలుప
అచ్చటపల్లకి దించుమనుచు తా నాజ్ఞయొసగె నపుడు
ముచ్చట లలరగ పల్లకిడిగ్గియు మోదముతో నపుడు
పురిజనములతో నిట్లనిపల్కె సుభద్ర రయంబునను
పరిజనులారా యిపుడు అచట మా బావలున్నవారు
బావలయెదుటను మరదలు దిరుగుట భాగ్యముగా దిలలో
బావలువినగా ముచ్చటలాడిన భామల కపకీర్తి
బావలుబాషింప గలిగినరాదే పడతులయినకాని
కావున మీరరుదెంచి నాపతిని కనుగొని వేగమున
ప్రకటితముగ నీసతివచ్చినదని ప్రార్థనగాదెల్పి
వదలిజన స్తలమున నాథ ర్తనం యుండుమనుచు జెప్పి
సరగునరమ్మని యాజ్ఞయొసంగిన పరిజనులేతెంచి
నరునిజూచి సుభద్రవచ్చెనని కరముగుదుగ దెల్పి
ఒక్కనియమమున శ్వేతవాహనుని నుండగ బ్రార్థించి
గ్రక్కున యూళ్ళపురీశు సహోదరి కడకు నేగుదెంచి॥

వ. పరిజనులా సుభద్రకు పార్థుని యొక్క నిజస్థలమందు నుండం బ్రార్థించివచ్చి నారదముని విన్నవించిన అప్పుడు పల్లవపాణియగు సుభద్ర పల్లకివెలువడి నుభయపార్శ్వంబుల ననుచారికలుతోడరాదన మనోహరుని కడకు నరుదెంచె నెట్లనిన.

దరువు - దర్బారురాగం - ఆది.

సుభద్రదేవి వెడాలే- మురసూదనునిసోదరి॥ సుభ॥ యిభరోహాశశిని భార్యయింద్రజునిభార్య - ఘనజఘనభార్యపతియురజభారమున కబరిభారమునచెలికభావమధ్యభాగమల్లాడగ॥ సు॥ మేలిమిసరిగెదుకూలచేలమువలీల గట్టి- రత్నాలరవికె జిగివాలుదొడగి - పాదకమలమున వజ్రాలబొట్టుమేలు కట్టుమెరయగ॥ సుభ॥ కరసరసిజములనొరసి మెరయుబంగరుగాజులుహరిమణి - కంకణములుబరిహసించు కరణి సంగుళములు - నుంగరములమరగభ్రమరకుంతలిసొరగుమణిహారములు - భారమునకువోరము - వారతగలిమెరయగకోరికలరపరిచారయుతముగ - వయ్యాదియూలపాళిశౌరి సోదరి॥సు॥



వ. ఇట్లు పార్థుకడకు జనుదెంచి పంకజపాణియగు సుభద్ర కంకణకింకిణీస్వనంబులెగయ ప్రాంజలిబద్ధురాలై తన మనోహరునింగాంచి మంజువాణి యిట్లనియె.

క॥ వందనము జీవితేశ్వర । వందేపాండకులభూషవజ్రికుమారా ।
వందే నీసముఖమునకు । నందకుమారుండుపనుప నరుదెంచితినీ॥

వ. అనిన విని సంక్రందననందనుండు మందస్మితసుందరవదనారవిందుండగుచు యాసుందరాంగియాననం బాలోకించి మందమధురాలాపంబుల నిట్లనియె.

క॥ దేవకివసుదేవులకును । రేవతిరమణునకు మురహారికి సాత్యకికిన్ ।
భావజున కతనితండ్రికి । ధీవిలసితకుశలమేకదా రాజముఖీ॥

గీ॥ అతివరో రుక్మిణీమణి యాదిగాగ । అష్టభార్యలకును పదహారు వేల । కాంతలకుక్షేమమే కదా కలువకంటి । యిపుడు దెల్పుము యీాళ్ళ పురీశుకరుణ॥

క॥ మీారడిగిన వారెల్లన।పారైశ్వర్యములుగలిగి ప్రమదముతోడన్ ద్వారకలోసుఖముగా ను।న్నారొక్కట కొదువలేదు నాప్రాణేశా॥

వ. అని ముకుళిత కరకమలయై నిలచి సవినయంబుగా తన ప్రాణవల్లభునితో నిట్లనియె.

## కథ.

లోకమాతహృత్కైరవసూత్న సుధాకరుడవ్యయుడు
లోకవందితుడు భువనరక్షకుడు గోకులపాలకుడూ
శాంతుడు భక్తచకోరచంద్రుడు సార్వభౌముడతడూ
కాంతునిజనకుడు దనుజసంహారుడు కరిరాడ్వందితుడు
మువ్వురుమూర్తులకు మూలకారణుడు మునిజనరక్షకుడు
దివిజేంద్ర ప్రముఖాకిలనుతుడు సుధీరుడు మురహారుడు
విశ్వగర్భు డఖిలాండకోటిబ్రహ్మాండమహోదరుడూ
విశ్వమెల్లదా వేయువాడితడు శాశ్వతు డాఘమడూ
నిర్వికారుడకలంక మహిమగల వీరుడనగ నతడే
సృష్టిజేయ పోషింపహరింపను శ్రేష్ఠుడతడె సుమ్మా
శిష్టరక్షణము దుష్టసంహారము జేయుకర్త యతడె
బంధుడితడు మాబావయనుచు మది భావించితివేమో
బంధమోక్షణుడు పరమపురుషుడని ప్రకటనగుట వినవె
అట్టివాని కపకారము జేసిన దుష్టుని మన్నించీ
కట్టాచక్రితోనీవు విరోధము బెట్టుకొనందగునా
శౌరికినీకును లేనిపోనియొక పోరిదేల ననుచు
క్రూరచిత్తుడగు గయునివిధమ్మని కొనియాడుచు నపుడు
పడతిసుభద్రాదేవి యర్జునుని పాదములకు నొరగి
పుడమినూళ్లపురి శ్రీగోపాలుని పొందుమంచి దనియె॥

వ. అని యనేకవిధంబుల ప్రార్థించుచు యీాక్షణంబున గయుని గానలోలుపాలికి పనుపుమని తన పాదాబ్జంబులపయి నొరగిన ప్రాణవల్లభను లేపి కూర్చుండ నియమించి యాదరంబున పార్థు డిట్లనియె.

దరువు - ముఖారిరాగం - అటతాళం.

గయునివిడనూపో గజరాజగమనా - నయముడిగి మీాయన్నగారికి నన్నుపగసాధించినా॥ గ॥ వనితా నేను యీాతనిరక్షించెదనంటి - వననిధులు బొర్లి ననుతారలు వసుమతీస్థలి వ్రాలినఁ దరిజేరినవారి తరిమికొల్పుట తగ వాధరణిదిద్దిరదిరగి శృంగినతరణి శశిగతిదప్పినా॥ గ॥ ఆక్రమించినదియని యీాళ్ళపురివెలయు - చక్రినాతలను త్తరించ నతిక్రమించగడంగినా॥ గ॥

వ. అని పార్థుండు నిశ్చయార్థంబు బల్కిన విని యామచ్చకంతి ఆశ్చర్యముపోవుచు నిశ్చేతనంబుగా కొంతప్రొద్దు మనంబునచింతించి యెట్టకేలకు గట్టుదెట్టు వట్టికరంబున తనకరంబున కరంబున బట్టుకొని గడ్డమునకు క్రింద నొక కరసరోజంబు నడ్డంబుగానుంచి వినయోక్తులతో ఘనవేణి యగు సుభద్రాదేవి యిట్లనియె.

కథ.

జీవితేశ నీమాటకెదురు నేజెప్పగ నోపుదునా
శాపమరుమలకు గలుగవచ్చునా బద్ధవైరమిలలో
ధాత్రీతలమున సగోత్రజు సతిమైత్రి గలగదగునా
క్షాత్రవంతుడిల దుష్టులగాచియు పాత్రుడగుట మేలా
దనుజవైరిమన బాంధవుడేయని దలచినావునీవూ
తనగృహదీపంబని ముద్దుకొన తగగాలకపోదూ
సచ్చరితుండవు యలుకశోకములు చిచ్చిదుటిది మేలా
కుచ్చితాత్ముడగు గయునికొరకు శ్రీగోపాలునివలన
పాండవసంతతి వర్ధిలనియ్యవ బలారాతి తనయా
కుండలిశయనుని మేలుగోరుచు నుండుట మరచితివా
ద్రుపదరాజసుత కభయమొసంగిన దపుడె మరచినావా
తపసియగుచునను వలచితివాతని దయయు మరచినావా
లక్కయిండ్లలో బ్రతికివచ్చుటది చక్రమహిమ గాదా
చక్కగ పాంచాలిని బెండ్లాడుట శౌరిబలము గాదా
హరునిచేత దివ్యాస్త్రము బడసిన దతని కరుణ గాదా
కరమరుదుగ ఖాండవమేర్చుట హరికారుణ్యము గాదా
కాలకేయులను గూల్చుట కృష్ణుడు గలుగుట వలన గదా

నీలవర్ణు డొానరించిన మేలది నీతో జెప్పనేలా
నీమనమునకే తెలుసును బాగా నిర్జరేంద్రతనయా
తామరసాక్షుని ప్రతినజెరుచుట ధర్మముగాదయ్యా
గ్రక్కున నీవీ గయుని విడిచితె మిక్కిలి సేమమగుగ
పెక్కులు దెలుపగనేల వీని వదలిపెట్టుము నిక్కముగా
అనిన సుభద్రను ఫల్గును డతిగాత్రంబునను
వనితా యింతటి సుజ్ఞానివనుచు నేనెరుంగా
యిప్పుడునీవు సమస్తముదెల్పగ నేర్పడ దెలిసితిని
నొప్పుగ నిన్నధ్యాత్మవిచారము జెప్పుమనగలేదే
మేరగాదనుచు నంగలువంగలు మేసిన సామ్యముగ
నారికేళతరుదూగలు మేసిన తీరున బల్కెదవా
గానలోలు డఖిలాంతరాత్ముడని యేనెరుంగునటవే
మారుగనాతడు మమ్మురక్షించుట గాననటే చెలియా
కుండలిశయనుడు మాపయి కృపగలిగుండు టెరుంగనటే
అండజాక్షి శరణార్థునిగావె ననుచు నమ్మబల్క
యిప్పుడాతని నంపజూచితే యిలలో నవ్వరటె
కప్పురగంధి నీమాటలన్నియటు గట్టిపెట్టుమింకా
యుర్వియయూళ్ళపురిశౌరి నాతల యుత్తరించువరకు
సర్వదా గయుని విడుననుపోవే నీశ్వరుని సాక్షిగను॥

వ. ఇట్లు గయుని విడుచుట కర్జంబుగాదని ధూర్జనాసబెట్టి నిర్జరేంద్ర తనయుండు గర్జించి సుభద్రను పో పొమ్మని కోపాటోపంబున యిట్లనియె.

దరువు - మోహనరాగము - ఝల్పతాళం.

పెక్కుసుద్దులేలనె టక్కులాడిపోపోవేమేనీ॥ పె॥ దిక్కెదోచలేదా నాతో దిక్కరిగాచినరీతిమిక్కిలి ప్రేలెదవా॥ పె॥ అగ్గజేంద్రవరదుని - కెగ్గు దల్పవలదని తెల్పె॥ పె॥ అగ్గలీకమూగతాతకు - దగ్గునేర్చినగతినాదగ్గరవదరె దవు॥ తరుణినీరాయభారము - పరువుబోమ్యెవ్యవహారము॥ పె॥ నూళ్ళపాళె హారికిగయునియ్యను - నాశిరమైననిచ్చేగాని॥ పెక్కుసుద్దులేలనే॥

వ. ఇట్లు దట్టించి బెట్టిదంబుగాబల్కిన గట్టుకొలగొట్టుబెట్టిపట్టిపల్కులకు మత్తగజమునకు చిత్తసంభవునత్తచిత్తంబున తత్తరపడుచు బిత్తరిచూపులతో భర్తపొత్తునచేరి మెత్తనిమాటల మన్నించుమని యిట్లనియె.

దరువు - భైరవిరాగము - ఆదితాళం.

ప్రాణనాయకా నాపై కోపమేల - నేనీకెగ్గుదెచ్చిదాయనేయ॥ ప్రా॥ భానుతేజబాహుబలుడవైన దీనెగానానా మేరూసమానాధీరూడవే॥ ప్రా॥ మురవైరియు నీవుమున్ను నరనారాయణులుగా నెన్నుదురు భూభారమును మాన్పనిట్లిరువు రవతరించినారు॥ ప్రా॥ చాలగమీరారని నొకరినొకరోర్వజాలుదురిలనూళ్ళపాళెశ్రీగోపాలుడే నీవు నీవెయతడుయేల నేను మాటలాడనిక మన్నించదగు॥ ప్రా॥



వ. ఇట్లు ప్రార్థనపూర్వకంబుగాబల్కి వెండియు శ్రీకృష్ణుని కడకేగుచున్నదాన యేమియాజ్ఞయొసంగెద రని సుభద్ర బల్కనవిని పాండవమధ్యముండు. గీ॥ పడతిరో నీవు మురవైరి పాలికరిగి। నానమస్కారములు దెల్పి నగధరునితో। గయునిపయికోపముడిపిన కరుణగావు। మనుముధరనూళ్ళపాలన వినడు నాజ్ఞ॥

వ. అని పల్కన కిరీటిని పునఃపునః ప్రణామంబు లాచరించి యతని వీడ్కొని యా సుందరాంగి బంగారు యందలంబెక్కి తొందరపాటున ద్వారకానగరంబున కేతెంచి మందరధరు మందిరంబుజేరి నందనందనుని పాదారవిందంబులకు వందనం బాచరించి యిట్లనియె.

కథ.

అన్నానీ విటుబనుపగా నామనోహరుని జూడబోయి
మన్ననతో నాప్రార్థనవిను మని మంచితనంబునను
గయునివిడువు మని బెక్కువిధంబుల గరిపితి నబ్జాక్షి

నయముగ సంబోధించిన నామనోనాథుడు వినడెపుడు
బంధమోక్షుడవయిన నీకు తన ప్రాణమైన యొసగి
గంధర్వుని రక్షింపగ దలచెను గాండివినిక్కముగ
అతని పంతమే నెఱవేరగని మ్మాంబుజభవజనక
అతడు ప్రతిష్టకు బోతెనీకల నప్రతిష్ట లేదు
అక్కజమది మీపూర్వచరిత్రను అజున కెన్నదరమ
ఒక్కతేజమది రెండువిధములయి అజున కెన్నదరమ
ఒక్క తేజ మదిరెండువిధము లయి యుర్విప్రకాశించె
నరనారాయణులనుచు నెన్నగా బరుగుచున్నవారు
ధారుణిలో కృష్ణార్జునులన నవతార మెత్తినారు
కాఫున మీకిరువురకును బేధముకలుగ నేరదనఘ
నీవెరుంగనిది యేమియు లేదిక నీకు దెల్ప నేల
సవ్యసాచి భుజవీర్యము నాతని శౌర్యధైర్యమహిమ
దివ్యచిత్తమున దెలిసియుందు నే దెల్పగ నేమిటికి
అదియుగాక పాండవ్యులునీ కరుణామృత పానమున
పదపడిరిపులకు జేయులగుచు యిల బ్రతుకుచున్నవారు
ధారుణిలో కౌంతేయు లనెడు యాభూరుహములు నాటి
నీరజాక్ష బెకలించి వేయుటది నీకు ధర్మమౌన
వనజనాభ నేవిన్నవింతునొక మనవి చిత్తగింపు
పనిబడివిజయుడు కనదొనలనువిలు బట్టినిలిచెనేని
ఇంద్రు డమరగణయుతుడై యెదిరిజయింప శక్యమౌన
చంద్రధరుడు నిజగణములు బన్నిన జయముగల్గబోన
జలజభవాండము నందు వసించెడు జనులొక మొత్తముగ
కలహమునకు నరుగుమీద గడంగిన గెలువ నలవి యగున
అమ్మహానీయుండెట్లు సంభవం బయినది వినలేద
యిమ్మహీనత ఘోనరించునాహవము లెరుగవ నీవెపుడు
యిప్పుడర్జునుడు బట్టినగాండివ మేనరునకు గలదు
అప్పురమేశునియొద్ద పాశుపతి మవని యెవడు బడసె
యెదిరిపోగోమనివాతకొచకుల నెవడుగూల్ప గలిగె
కదనమునిండా కాలకేయులను గడగి యెవడుగెల్చె

ఇలలో పౌరుషనామంబులు నదియే నరునకు గలవు
విలువిద్యలో నిపుణుండు బాహుబలవిక్రము డింద్రజుడు
క్షత్రియవంశోద్ధారుడు పార్థుడు క్షాత్రవంతుడతడు
ధాత్రిలో విజయుండు నప్రసిద్ధిగల ధన్యాత్ముండతడు
సాధుపోషనుం డనఘుడా ర్తజన సంరక్షణు డతడు
భూతలేంద్ర ధీరజీరుడజేయుడు భూరియశోధనుడు
యిన్నిట విజయు డగుణ్యుడనుటయా హేతువు నీమహిమ
కొన్ని దినంబులు గొప్పజేసిమరిపల్చపరుపదగున
ఏనను శరణాగతునిగాతు నని యభయదాన మిచ్చి
దానుమలర తెగజూచుట క్షత్రియధర్మముగా దిలలో
దిట్టడనుచు నది యెగ్గనిమనసున బెట్టకనీవిపుడు
యెటులయినను మన్ననతో నాప్రాణేశుని గావవలెా
అనిన సుభద్రనుజూచి యశోదా తనయు డిట్టులనియెా
వనితరో పాండవమధ్యముడిలలో నవారితవక్రముడ
తరుణీమణిరో నీమనోహరుడు ధరనుబ్రశస్తుడటే
సరసిజాక్షి నీజీవితేశ్వరుం డరిభీకరుడటవే
చాలుచాలు నోయమ్మానీపతి సాహసంబు దెలిసె
మేలుమేలు నీనాథుని నాకడ నేలబొగడెదీవు
యువిదరో సతులకపేక్ష గలపై యుండుగాని ధరలో
తనవి సోదరులపైని గలుగ దది తథ్యమైనమాట
యింతిరోనీతో మాటలింతే చాలేటికి నిల్పుమిక
ఇంతయేల నాతనికి కలహ మదెంత జరుగవలెనో
అంతయు జరుగక తప్పబోదునీ వింతట శీఘ్రముగ
అంతఃపురమున కేగుమనీ కిరంతుతో పనియేమి
శౌరిటుబల్క సుభద్రలేచి తన సదనంబునకేగె
వారకనాపమయమ్మున సత్యాచారుడార్యసముడు
సజ్జనుండు ధృతిమంతుడు పుణ్యుడు సాధుపోషణుండు
ముజ్జగములలో కీర్తిపరుండన బొగడదగినవాడు
బాహుబలాఢ్యుడు పరగహృదయమున భల్లమనం బరగు
సాహసవితరణశాలి యైన యాసాత్యకి జనుదెంచి

ఘనుఁడగు కృష్ణుని గనుగొని యిట్లని మనవిరీతిగాను
వనజదళాక్షా పాండుకుమారులు నెనరగు బాంధవులు
మునుకొని వారేవురిలో పార్థుడు ముఖ్యహితుడు నీకు
మనసుభద్రకును మనోహరుడు నీమరదిఫల్గునుండు
ఇత్తరియోచన కలవదితుడు మేనత్తకొడుకు మనకు
చిత్తసంభవునివంటివాడుసుమి చిత్తగింపుమయ్యా
పరులకొరకు తమవారినిజెరచుట భాగ్యము గాదిలలో
మెరిగిమెరుంగక సుతులుహితులు యొక యెగ్గొనరించినను
గొప్పవారు మన్నించుట ధర్మమె కొరతలేదునీకు
చెప్పజాల నామనవిగైకొని చిత్తగింపుమయ్యా
విజయునికొరకై గయునిప్రాణముతో విడిచి మన్నించుమి
త్రిజగన్నుత సకల సర్వేశ్వరుడు హరిహరాదివినుత
పరగనరుని యీతప్పుగావుమో మురహరాయటంచు
సరసమధురసోక్తులతో మ్రొక్కిన సాత్యకినటుగాంచి
అప్పుడిట్లనుచుబల్కె కంససంహరుడు గోపమునను
తప్పదు పంతము వినుము నాకెదురు జెప్పవలవదిపుడు
తమ్ముడవినుమా పార్థునిమీదికి దండువెడలవలయు
క్రమ్మరనీవు చతుర్విధబలముల గ్రమ్ముదేరునటుల
ముందు మహాహవభేరిరణంబున మ్రోయబనుపుమోయి
సందియమేటికి నన్నిరమిప్పుడు జరుగును నిక్కముగ
అనుచు మురహరుడు దెల్పసాత్యకి నతిరయమున నేగి
ఘనసైన్యకులకు తెలియగ దనభేరి గ్రక్కున వేయించి
రణరంగములకు యోధులుబిల్వగ ఫణిహారుల బంచీ
ఫణితల్పకుడగు మూళ్ళపాళె గోపాలుని సోదరుడు॥

వ. ఇట్లు శాత్యకి తండోరా వేయించి యఖిలబలంబులగూర్చిన తత్సమయంబున కృష్ణుండు బలభద్రుండును సాత్యకియును తత్కుమారవర్గంబును యదువృష్టిభోజాందకులదయిన యోధాగ్రేసరులును తమతమ నిజబలంబులగూర్చుకొని యవ్వీరానీకంబు లొక్కపెట్టున శంఖచక్రగదాఖడ్గపరశుపట్టిస బిండివాల ముసలముద్గర శూలకుఠారకటారి పంకిణి యంకుశకుజ్జకుంతలపరిఘగణయత్రిప్రాసతోమరాది వివిధాయుధప్రాణు లయి యర

దంబులెక్క వీరభటోత్తములు ధరణి గంపింపుచుండగా మునుమునునడువ తత్సైన్యము శ్రీకృష్ణుని వెనుకొని మహోద్దండంబుగా వేదండంబులనెక్కి కొందరు జనుదేరి కరిభటోత్తములవెంటనే తురంగంబులవారు వెడలి అశ్వికులతోడనే కాల్బలంబులు యుద్ధసన్నద్ధులై బయలుదేర నిట్లు చతురంగ బలంబుతో పతగపరివాహనుం డయిన గోపాలదేవుండు చతుస్సముద్రంబులు యొకముఖంబుగా క్షితిపైకి బొర్లిన పదంబున మహోద్ధండంబుగా వెడలి ద్వైతవనంబున కేతెంచుచున్న సమయంబున.

కథ.

రమణీయంబగు కరినగరంబున రాజుసుయోధనుడు
ప్రమదముతోడ జెలంగును సకలాభరణభూషితుండై
హితులమంత్రి సామంతులతో నాశ్రితసందోహముతో
సుతసతకముతో నఖిలధారుణి పతిసముదాయముతో
కలశజభీష్మ కృపాశ్వత్థామ ఆదిగాగల యోధులతో
బలియురుసౌబల సైంధవాది బంధువర్గములతో
సవరణగా తపనీయనిభంబగు సభామంటపమునా
అవిరళచిత్రరు స్తంభరూపమగు నంతరాళకమునా
శీతభానుగురురత్న చోకాటపు సింహాసనమునను
ప్రీతితో నాసీనుండయియుండెను పెద్దకొలువుగాక
ఆసమయంబున నారదమునివరు డాస్థానంబునకు
వాసుదేవుని బాడుచురాగా వసుధేశుడు జూచి
అతిమోదముతో మానికర్ఘ్యపాద్యాసనముల నిచ్చి
హితవచనములతో కుశలమడుగుచు నింపునెరపువేళా
నారదుడిట్లని పల్కెను కురుభూనాథుని వినుమనుచు
ధరను యూళ్ళపురి శ్రీగోపాలుని తప్పక ధ్యానించీ॥

వ. ఓయి ధృతరాష్ట్రమహీవల్లభా నేడరుణోదయంబున మురమర్ద నుండు తరణికర్ఘ్యంబొసంగగా నతని కరపుటంబున గయుం డనువాడు నిష్ఠీవనంబు వైచెనట యిదికారణంబున మదనగోపాలుండు సుదర్శనాయుధంబున గయుని శిరశ్ఛేదనంబు జేసెదనని శాబ్ధిబూనినాడు పార్థుడా గయుని కృష్ణునిచేత చావకుండా రక్షించెదనని అభయంబు యిచ్చినాడు అందుకు మదనగోపాలుండల్గి ధనంజయునిమీద యుద్ధంబు సేయుటకై యటువృష్ణి

భోజాంధకవీరులతో చతురంగి సైన్య సమేతంబుగా నెత్తివచ్చుచున్నాడు కావున యీ సమయంబున పాండవులకు మీరు సహాయంబగుట కర్తవ్యం బని సముచితంబుగాదెల్పి నారదమునివరుం డరిగె తదనంతరం బా.

## కథ.

సభలో నింతయు దెల్పి నారదుడు చనుదెంచిన పిదప
ప్రభుడగు ధృతరాష్ట్రుగని భీష్ముడు పరగనిట్టు లనియె
అవనీవల్లభ పాండవులు నీయాజన్మునిసుతులు
తవిలివారికి సహాయముబోవలె తడవు సేయవలదు
ఎప్పటికెయ్యది సంభవమగునో తప్ప దెవరికయినా
ఇప్పునికభ్యంతరము జెప్పరా దిభరాట్పురినాథ
అతిరయముననిటు జేయుడనుచునీ వనుమతి యొసగుమని
ధృతరాష్ట్రుని సమ్మతినొందించియు దేవనదీసుతుడు
అతడుదాన సుయోధనాదులకు నాజ్ఞయొసంగినను
అతిముదమున ధృతరాష్ట్రమహీధవు లన్నలు దమ్ములును
శకునిసైంధవులు కర్ణ వికర్ణులు సమయమిదే ననుచు
ఒకరిమో మొకరుజూచుకొనుచు నతివుత్సాహంబునను
దనహాసితాననములతో నందరు తలలు యూచుకొనుచు
కరములదీర్చుచు వేళ్ళతో మీసము లురువడి దీటుచును
ఆడగబోయిన తీర్థ మెదురుగా నరుదెంచినరీతి
పోడిమిగామన కార్యములన్నియు నేడు సఫలమాయె
అనియిటుదలచుచు మనముననుబ్బుచు ఘనముగ దెలుపగను
వినిసుయోధనుడు మురియుచు హరితో వేగనిట్టులనియె
ఎంచిచూడగా మాత్యులార యిది మంచిసమయ మిపుడు
అంచితముగ కౌంతేయులకు సాహాయముగా నేగి
కరమరుదుగ నా పాండవేయులతో గలసి కదనమునను
మురవైరిని తత్సైనికులను నిర్మూలము గావించీ
తదుపరి కుంతీకుమారుల నేపుర ధారుణిగూల్చినను
పదపడితోడనె ధరణికెల్లనే నదినాథుడనౌదు
కావుననంతె యొనర్పుటముఖ్యము కడుశీఘ్రంబునను
ప్రావీణ్యముగ దండు వెడలుదుము బండనమున కపుడు

వీరులార మనతేరులన్నిబయల్ దేరదీయుడికను
వారకమనకు స్వతంత్రులైన భూవరులను రమ్మనుడీ
వివిధంబుల కెల్లదండురా వేయఁబనుపు డనుచు
ప్రవిమలమతియగు సారథినటు పరగున రప్పించీ
డేరాయత్తము జేసివేగమె దెమ్మని నియమించీ
పరగసుయోధనుడప్పుడు సకలాభరణభూషితుడయి
వరమణినిర్మితమయినకిరీటము శిరమున ధరియించీ
పొంకమలరగా బెట్టిదమయినది కంకణంబు దొడగి
కొంకుటొంకలకోసరి యింతలేకరొక కోదండముబూనీ
కౌరవనాథుడు వేగమెజహారాదము వెడలగను
సారథిరథమున హరులబూన్చుకొని సరభసమునరాగ
అపుడు కురువరుడు రథారోహణం బాచరించగాను
నిపుడు సారథి యరదముదోలెను నిర్జరు లరుదొంద
శరశరాసనాల్ బూనిరథమువిూదన చక్కబరుచుకొనుచు
కురుభూపాలుడు శంఖమునూదెను కొండలుఘూర్ణిలగా
అతివేగమున మునుమునుకౌరవ పతితా వెడలగను
అతని వెంటనే గాంగేయుడు ద్రోణాచార్యులును
గురుతనూజ కృపకర్ణ సౌబల కురుకుమారవరులు
పరగవివిధదేశాధి నాథులును బంధువర్గములును
అధికముదంబుననమర సన్నిభులు నరుగుచు రయమునను
అధికులంతనొక పట్టున వెడలిరి పృథివి చలింపగను
కరిభటతురగ పదాదినముదయము సరభసమున వెడలె
నరమహామలిదియానన నొప్పుచు కురువాహినులడరా
అక్కజంబుగా లెక్కకు మిక్కలి యైన బలంబులతో
మిక్కిలి సంతమున సుయోధనుడు గ్రక్కున జనుదెంచీ
ద్వైతవనంబుననున్న పాండవులదాపు జేరిబోగ
అతడువచ్చు విధంబు ధర్మజుండా క్షణమునదెలిసి
మనకు సహాయమువచ్చెను దుర్యోధను డని తెల్పుచును
అనుజులు దానును వారల కెదురుగ నరుగుదెంచి నిలచీ
ఘనముగ ధర్మజు డాసుయోధనుని కౌగిట జేర్పగను

కని సుయోధను ధర్మజమ్మృదుపద కమలములకునొదిగి
తమతమ క్షేమసమాచారంబును మదితలపోయుచును
శమననందనుని సుయోధనుడు చయ్యన నిట్లనియె
మురహరుండుమీతో కలహమునకు మోహరించె ననుచు
అరసి నారదుడు దెల్పగనీకు సహాయము వచ్చితిమి
అనియిట్టు దెల్పగ ధర్మతనూభవు డానందింపుచును
పనిపడి యట్లొనరించుడనుచు తాబలుకుచున్న వేళ
జలజభవాండము సంతరించగా కులగిరు లదరిపడగ
యిలను యాళ్ళపురిగోపాలుడు దండెత్తివచ్చె నపుడు॥



వ. ఇట్లు చతురంగబలంబులతో పతగపతివాహనుండైన గోపాల దేవుం డెత్తివచ్చిన బలంబు ద్వైతవనంబున నొక్కవిశాలస్థలంబున క్రౌంచవ్యూహంబులుగా మోహరించుకొని సింహనాదంబులు శంఖ నిగ్రనంబులు భేరీరవంబులు కార్ముకగుణధ్వనులు భూనభోంతరాళంబుల ప్రతిధ్వను లెగయుచుండ జెలకుచున్నట్టియెడ యిన్నిశబ్దంబులు హరించి బ్రహ్మాండకర్పరంబు పెటిలిపడం చక్రధరుండు పాంచజన్యం బతిఘోరంబుగా పూరించిన అమ్మహారవంబు వినుచున్న వాడయి ధర్మజుండు కౌరవ వీరుల నాలోకించి యిట్లనియె.

కథ.

అదుగో చక్రధరుండువచ్చె తా నఖిలజనంబుతో
తడయగనేటికి లెండువానిపై తారసిల్లుదాము
అనియుధిష్ఠిరుడు బల్కినవిని తానపుడు కురువిభుండు
ఘనులగు రథికుల నెల్ల మొత్తముగ తరలినడువబనిచి
నురువడించి చతురంగబలంబుల బురికొల్పుచునపుడు
పాండవాగ్రజుడు తమ్ములగనుగొని భండనమున కిపుడు
కుండలిశయనుడు వచ్చినాడు యిక లెండని తెల్పుచును
శరశరాసనాల్ బూనిరథముపై సరభసమున నెక్కి
నురువడినడరగ ననిలసుతుం డొక యరదమెక్కి వెడలె
నిట్లుగ పార్థుడు రవినిభమైన కిరీటము ధరియించి
హాటకనిర్మిత మైమృదువయినది యంగిధరించుకొని
అకలంకంబయి నవమణిమయహారంబులు ధరియించి
ప్రకటితముగ వదనంబునీటునను బటువుగ గట్టుకొని
అతిభీకర మగు గాండీవమప్పుడు కరమునందుబూని
హరుడొసంగిన పాశుపతాస్త్రము కరమర్దిగ బూని
దివిజేంద్రుడుతన కిచ్చినశంఖము ధీరతగైకొనుచు
ధవళహరులు బూన్చినరథమున కపిధ్వజమపు డెత్తించి
రథారోహణము జేసిధనంజయు డధికసంతసమున
ప్రథనోత్సాహుడు పార్థుడుతర్లెను బాహుబలాధిపుడు
అతనివెంటనే కవలువెడలిరి రథముల నెక్కుకొని
అతులితంబుగా పాండుకుమారులు అనికి వెడలినపుడు
విజయమౌననుచు ధౌమ్యుడొనర దీవించె నద్భుతముగ
కడుమోదముతో ధౌమ్యుని దీవెనగైకొని పాండవులు
వెడలుసమయమున ముచ్చట గడగడ వడకుచు గయుడపుడు
పెదవులుదడపుచు వెలవెలబోవుచు భీతిలి యేడ్చుచును
హృదయముదీరగ ధరపై పొరలుచు హాయని వగవగను
కనుగొనిపార్థుడు రథముడిగ్గి యాగయుని లేవనెత్తి
వినయముతో నూరార్చికరంబున వీపున దువ్వుచును
ప్రాణభయము లేదింకవెఱవకు మని ప్రాభవమొప్పగను

తూణీరములో గయునిజేర్చుకొని తొందరపాటునను
నగధీరుడు నరుడరదమెక్కగా నాసమయంబునను
గగనమార్గమున దివిజులుపార్థుని కరుణను మెచ్చుచును
అసహాయుడుగ మాద్రిహృదయు డితడనుచు నెన్నుకొనుచు
కుసుమవర్షములు గురిసిరిపార్థుని గుణము మెచ్చుచును
అత్తరిపాండుకొమారులయరదము లరుగుచున్నవేళ
మత్తగజగమన పాండునికోడలు వుత్తమయిల్లాలు
అతిరయమున దాపార్థునిరణమున కడ్డము జనుదెంచి
హితవచనంబుల నిట్లనె నూళ్ళపురీశుని మది దలచి॥



వ. ప్రాణనాథా యీ కదనంబేల నీలవర్ణుండు మూలబలంబులతో నాటగాగల చతుర్విధవాహినులతో కోలాహలంబుగా నేల యీనినట్లు మోహరించినా డా జలజాక్షునితో కలహమునకు గడంగి గెలువ నెవ్వరోపుదురు అమ్మహాత్ముండు విశ్వగర్భుం డాదిపురుషుం డవ్యయుండని విను చున్నారము గావున అతనితో గయ్యంబుల కియ్యకొనక గయుని విడుచుటయే కర్తవ్యంబు విడువు మని వెండియు పాదాంజలియై యిట్లనియె.

కథ.

గ్రహగతిజాలక పట్టమురాజ్యము గృహముధనము విడిచి
గహనభూములలో దిరుగగ లేపె నీకాలకర్మ మేమొ
కూరలుగూళ్ళుగ భక్షణచేయుచు గుచ్ఛింపుచునలసి
వారక యెండకు గాలికివానకు వాడివాడి యలసి
వనవాసమునను కడవైగమయి వచ్చియున్న దిపుడు
పనిబడి యీవెత దీరినతదుపరి బ్రతుకుదు రని దలచి
మన పురాకృతము గయునిరీతిగా జనుదెంచిన దిపుడు
అనుకొన పనియే లేదు విధికృతం బనుచు దలపవలయు
ఇపుడు మనకు గోపాలు డొనర్చిన దపకారముగాదు
అపుడా కష్టము లన్ని మనకు హరికృపచే దప్పినవి
పంతముమానియుండు మనవి నీవింతట గయుకొనుచు
దంతివరదునకు గయునియొసంగుము సంతసమలరగను
ప్రభునివిభు డిట్లొనరించిన శుభముగల్గు మనకు
త్రిభువననుతుడగు యూళ్ళపురీశు డభయమొసగు మనకు॥

వ. అని యిట్లు కుంతికోడ లత్యంతచింతాభరయై తనకాంతుడయిన పార్థునితో గయుని విడువుమని ప్రార్థింపగా నతం డిట్లనియె.

చ॥ సరసిరుహాయతాక్షి మురసంహరుమూకలుచూచి దీనికే
వెరచి వచించితంచునను వీరులు నవ్వరె యెంచిచూడగ
ధరలు ప్రశస్తమైన నృపధర్మముగాదది మున్ను నాకుశం
కరుడు వరంబొసంగి ననుగావడె యూళ్ళపురీశు నోర్వడే॥

వ. కావున తనచావునకు వెరచిన యార్తునింజంప నిచ్చినాడని లోకులు నన్ను నిందింతురు. ఇప్పుడే నతిత్వరితంబున జని మురవైరిని తత్సైనికుల నిర్మూలంబు గావించి విజయంబు గయికొని వచ్చెద నుండు మని ద్రౌపదిని వీడ్కొని తత్సమయంబున.

కథ.

శమనజు డనిలజు డింద్రుడు నకుల సహదేవాదులను
విమలహిరణ్య యరదములనెక్కియు సమరోన్ముఖులగుచు
కడుభీకరముగ వెడలిరి రయమున పుడమిచలింపగను
తడయక వీరులలో గలపియు తత్సమయంబునను॥

వ. అప్పుడా పాండవేయులు కురుబలంబుల గలపికొని గట్టి మొత్తంబై పౌండ్రక దేవదత్తాదిశంఖంబులు రోదసీకుహరంబులు ప్రతిధ్వనింపని

పూరించి రట్టియెడ శ్రీకృష్ణునిసారథియగు దారకుండు కురుబలంబుల చక్రి జూడుమని యిట్లనియె.

దరువు - సురటరాగం - అటతాళం.

ఇంతాసైన్యమూ - యెట్లుగల్గెవీరి - కింతాసై॥ ఇం॥ అంతుగానకా జూడమాడి కౌరవులకూ విభవమంతానోడి॥ ఇం॥ కుంతీసుతులు కాంతార ముల పాలైనవారి కింతాసైన్యము॥ ఇంతా॥ యరదంబులేమి కరిబృంద మేమి తురగంబులేమి పరివార మేమి॥ ఇం॥ ధరలెల్లనిండ బరతెంచినారరయంగ చోద్యమెరిగింపుమయ్య॥ ఇంతా॥ జలజాక్షనీదు బలమైనయంత బలియంబు లేదు యిలనూళ్ళపాళె నిలయా యిదేమొ విలయంబునాతో తెలియంగ బలుకవలె నిందిరేశ॥ ఇంతా॥

వ. అందుకు నందనందనుం డిట్లనియె. ఓయి ద్వారకా నారద మునీంద్రుని ప్రోత్సాహంబున కౌరవులు చతురంగబలంబులతో కౌంతే యులకు సహాయంబుగా వచ్చినారని వెండియు పుండరీకాక్షుం డిట్లనియె.

కథ.

అనుజా చూడుము కౌరవసైన్యము గయునిజంపవలెను
అనిమిషమాత్రుడు విప్రుడు భుజబలు డస్త్రశస్త్రగురుడూ
హితనిర్మితగోపుర కేతను డతడే కుంభజుడు
నీటుగ సింహపతాకముగల్గిన మేటిద్రోణసుతుడు
అంబరమణిరుచి కనకవృషధ్వజు డాఘనుడే కృపుడు
కంబునిభంబగు హంసకేతనుడు కానీనుం డితడూ
అదిగోచూడుము ఫణిరాట్కేతను డతడె రాజరాజు
వడిగలశూరుడు తాటిశిరముగల వాడెనదీసుతుడు
అని యీవిధమున వేరువేరుగా నందరుజూపించి
మునిజనవందితు డూళ్ళపాళెపుర మురనరకాంతకుడు॥

వ. అని ద్వారకునితో కౌరవుల వేరువేరుగా నిరూపించి ద్వారావతీ నాథుండు పాంచజన్యం బతిఘోరంబుగా పూరించెనప్పు డుభయబలంబుల వారును శంఖంబులొత్తుచు సింహనాదంబులు సేయుచు కార్ముకధ్వనులు సెలంగం దలపడి రెట్లనిన.

కథ.

అట్టహాసముగ రథికులతో రథికానీకంబులును
మట్టాడుచు గజభటులు గజముల మార్కొని రట్టియెడా

వడినాశ్వికులాశ్వికులను దలపడితొడరి పెనగిరపుడు
వడికాల్బలములు కాల్బలములతో నడరునద్భుతముగ
ఉభయసైనికులు తారసిల్లిరతి రభసంబులతోను
ఉభయంబులు ధనువుల నెక్కిడి యొక్కుమ్మడిగలసి
అంచితంబుగా చిత్తస్వాతి జోడించి చందమున
యెంచరాని శరవర్షములును గురిపించి రొండొరులపై
పెల్లరచుచు యిరువాగును గురిసిన భల్లపుఝల్లులకు
యెల్ల సమరభూతములచీకటి వెల్లిగ్రమ్మదేర
లోబడువారిని పైకొనిరణమున రూపడంచువారు
తూపులునిగుడ్చుచు పగతురశిరములు ద్రుంచివైచువారు
ఒక్కవీరభటు డుక్కుమిగిలి పొగరెక్కి బోరుచున్న
పెక్కుమందియా వీరునితలపడి స్రుక్కించెడువారు
నిలిచెవిరోధులనిగ్రహించి భుజబలముచూపువారు
చెలగియార్చుచును పరగసైనికుల చెండివైచువారు
రాతులాకరికొక రాహావమున తమసేగిజూపువారు
ఖ్యాతిగ కొందరు మల్లయుద్ధముల గడగి పెనగువారు
పగతురశిరములు గదాయుద్ధమున బగులగొట్టువారు
అగణితముగ గజములను రౌతుపయి కదలించెడివారు
తురగము లెక్కియు వైరులమీదను దుమికించెడివారు
దురుసుగ యేనుగలెక్కి శత్రువుల ద్రొక్కించెడివారు
అరదము లరిబలములపై దోలియు హతముచేయువారు
పరువళురువడి జేయుచు శరములు గురిపించెడివారు
వారకనిటు కౌరవులు యాదవులు వీరావేశమున
ఘోరరణంబుల రెండుమొత్తము లవారితగతిబెనగ
అప్పుడూళ్ళపురి శ్రీగోపాలుం డయిన పరాత్పరుడు
తప్పక దుర్మదా లెల్లహరింపను ధరనుమీాద నిలిచె॥

వ. అట్టియెడ దుర్యోధన దుశ్శాసన కర్ణ వికర్ణ గాంగేయ కుంభసంభవకృపాశ్వత్థామబకుని సైంధవసోమదత్త భూరిశ్రవశల్యాదిముని యోధులొక్కపెట్టున యదుబలంబులపై నడరి దోర్దండవిక్రమంబుగా కోదండకాండంబు లుద్దండవిక్రమంబుగా పిగుడించి కొందరిని గూల్చుచు రథంబులు విర

దంబులు గావించుచు తురంగంబుల నిరంగంబు గావించుచు ద్విరదంబుల నరదంబులపై బడద్రోయుచు యిట్లల్లకల్లోలంబులు గావించిన వీరులవారికి నిల్వలేక యదుసైన్యంబులు పారిపోవుచున్న జూచి చక్రధరుడు చెయ్యెత్తి నిల్వరించి సేనాధిపతులయిన బలభద్రసాత్యకులతో నెల్ల బలంబుల బురికొల్పుకొని రండని శేషశయనుండు కోపావేశాభీషణాకారుండై నిజబలంబులుం దాను నొక్క మొత్తంబయి యక్కుమిగిలి కౌరవబలంబుల పయిం దలపడి రప్పుడు.

## కథ.

దధిచోరుండతి కోపముతోడుత దారకు నటుబిలచి
రథము కౌరవవ్యూహముమీదికి రయమున దోలు మని.
మధుహరుడప్పు డజాండకటాహము బధిరము గానునటుల
పృథివిచలింపగ తారలురాలగ వుదరములూటాడ
పాంచజన్యమపు డద్భుతముగ పూరించి మురాంతకుడు
అంచితంబుగా సారంగమున అక్కడి యరిబలములమీాద
ఘోరముగా పటుబాణవర్షములు గురియుచు దర్పమున
తేరులునుగ్గుగ జేసి రథికులను ధారుణి బడగూల్చి
సారథులను దునుమాడి హయంబుల చయ్యనగూల్చుచును
భూరిహయంబుల దునిమి రౌతులను వారక నఱకుచును
మూకలుగాపయి భటకాల్బలము లనేకులగూల్చుచును
ప్రాకటముగ బాణానలజ్వాలలు బర్వగజేయుచును
మరియుమహార్ణవమధ్యమున దిరుగు మందరనగమనగ
కురుసమూహమున జొచ్చి కంససంహారుడు దలంచుచును
అంపవానలను గురియుచురిపులను హతమొనరింపగను
తెంపుతో నట్లొనరించి హరింగని కంపమొందివారు
హరింగనుంగొని వేళచందమున వెరచి పరచువారు
ఎరుగకనడరి ముకుందునిచేతులో హరణమొందువారు
సరసిజనాభుని సేనతో మార్కొని సమసిపట్టినారు
ధరను యూళ్ళపురి శ్రీగోపాలుని దాడికోర్వమనుచు॥

వ. ఇవ్విధంబున శ్రీకృష్ణాదియదువీరులచేత జచ్చినవారు చావగా దక్కు కౌరవసైన్యంబును దశదిక్కులకు బారిపోవం దొడంగె నట్టియెడ

కొందరతివేగంబున కౌరవేంద్రునికడ కేతెంచి ప్రలాపించగా నతండు ధైర్యం బవలంబించి భీష్మద్రోణాదియోధుల నురువడింతము రమ్మని గండనాయకులం బురికొల్పుకొని యఖిలంబుల చేవిడిచి యదుసైన్యంబులమీఁదికి మరల నొక్కుమ్మడి గదిసిన సంకులసమరంబయ్యె నట్టియెడ.

క థ.

అరనీకాంద్రామతితో మరియును గౌరవనాథుడు గడగె
నీరజాక్షువక్షమున నాటగా నిశితసాయకము వేసె
గ్రక్కునకోపముతోను కంసమర్దనుం డపుడు
ఒక్కబాణమున నతనిపంచె నందనందనుడూ
పెక్కునాడితూపులను పెల్లున కురుబలములపైన
అక్కజముగ గురిపించి వుక్కుమిగిలి చెరగగను
మురసంహారుడ యిపుడు కురువీరులు మొత్తముగ
పరగచుట్టుముట్టుకొని బాణాసనముల బూని
శరనిధిసంభవు డెదిరి యరువదిశరముల నేసె
గురుడు నలువుగను నూరు ఘోరభల్లముల వైచె
ఆచార్యుని సుతుడరువది తూపులు వైచె
చూచికృపుడు బదమూడును నిశితాంబకములు వేసె
తరణిసుతుడు పదహారుమెరుగు తూపులడరించె
కురుకుమారులు ధరను సరభసమున పెల్లడరి
వరుసనిరువదేనమ్ములర్పిరి హరిపైగుములయి
పరగ శకునిసైంధవులు పదిపదిభల్లములు వేయా
పలువురొకరిచే మొగినడంజలరుహ విభునిదొడరి
కులగిరిపయి ఝడివానాగురిసిన సామ్యముగాను
కురుబలంబులగ్గముగా గురిసిన శరవర్షములు
కరలాఘవ మొప్పగను మురహరుడగణితముగను
విశిఖవర్షముగురిసి ప్రతివిశిఖములనుదునుము
పతగవాహనుండపుడు పటుకాంద్రంబునయార్చి
కౌరవ్యుల కిదిప్రళయ కాలమనుచు మదినెంచి
వారందరి నాలేసివాడితూపుల నొప్పించి
శౌరివిజృంభించగను పారిరిపునాథుని వెనజూచి

మేరామురహంకారా పోరేవా నాతోను
ధారుణియూళ్ళుపూరిను పేరెరుంగవా నీవు॥





వ. అప్పుడు కౌరవసైనికులు మొత్తంబులై వైచిన భల్లంపుర్షుల్లు
లకు జిత్తజనకుని శరీరంబు నెత్తుటం జొత్తిలుచుండగా నలెందు బావలు

పాటవంబున ప్రతివిశిఖంబులవారించి పటుభల్లంబుల నిగుడించి పగతుల నరికించి దుర్యోధనుంగాంచి యిట్లనియె.

కథ.

ఔరాదుర్మతి పాండవులకు సహాయము వచ్చితివా
వారికారణమున నీకాప్తులయి నారటరా నేడు
కదనరంగమున నాతో బోర నీకు సామర్థ్యము గలదటర
పాండుకొమారులకొరకు నీవు నీబలములతో వచ్చి
భండనము నాచేతజావగా బ్రహ్మ వ్రాసినాడు
నీవుదలంచిన యత్నమేదో యిదినిన్నే హరించునురా
త్రోవదప్పి నీవు సిగ్గులేకను దోడరివచ్చినావు
యింతటనయినా హరిపొమ్మని నన్నెదిరి జయించెదవా
యింతమాత్రము కొరంతలేదె నీపంతము చెల్లదురా
చలముడుగకను యిటులనె మాతో కలహించితివేని
బలముల నిన్నును సంగరభూస్థలి పాలియించెద నిపుడు
అనిలనురారినిచూచి సుయోధను డపహాస్యంబునను
వనజదళాక్షుని దూలనాడె తనవాగెబలంబులతో
పసులగాచుకొని బ్రతుకుచుండు నరపశువనంగనీవు
అసమర్థుండవు నీచపువర్తన మధమపుగొల్లడవు
వసుమతి ననధికారార్హుండవు పశుపరిపాలుడవు
కసిమసంగి మావంటిరాజులతో కయ్యముచేసెదవా
దిక్కుదోచక యెదురుమళ్ళినను వెక్కిరించినీవు
ఒక్కనిమిషమున నిను నీబలముల నుక్కడగించెదరా
ఇదుగోచూడుము కరువలికార్ముక మెత్తినమార్గమున
మదనగురుడు ప్రళయానలాస్త్రము సమంత్రకంబుగాగ
పట్టివెవనది భగభగమండుచు బిట్టుగ నేతెంచి
నెట్టనకురుపతి నతినిసూతురణ నేమిహయంబులను
అక్కజంబుగాగూల్చె నతినిహితులందరు మెంచగను
చక్రధరునిచే కౌరవనాధుడు చచ్చిన పిమ్మటను
అతనిసహోదరు లతనిబాంధవులు నతనిముఖ్యహితులు

అతులితముగ విందానువిందులపు డందరొక్కమొగిని
వారిజనాభునిమీద గలసిపయివానలు జడగురియా
ఘోరాంబకముల వారినందరిని గూల్చెమురాంతకుడు
అప్పుడు కౌరవ యోధాగ్రేసరు లాగ్రహమున నడరి
తప్పకకృష్ణుని బెదరిబీరము నుదరము జూపుచును
సమరముజేయుచునుండగ కర్ణుడు సాత్యకి నటుగాంచి
అమితరౌద్రమున శరజాలంబుల నాతని నేసినను
శినిజుండపుడు మెరుంగుటమ్ములను యినతనూజు నేసె
సునిశితశరముల కర్ణుడు సాత్యకి సూతుని తెగటార్చి
రయమున పదిపదిమార్గణములతో రథ్యంబుల గూల్చె
వియచ్చరులు దిగులొందగ సాత్యకి విరథుండయి యున్న
తడయక కర్ణుడు బ్రహ్మాస్త్రంబును ధనువునుకరిబోసి
కడగిసాత్యకిని గూలనేయగా గమకింపుచునున్న
కౌరవ్యులతో బోరుచు కృష్ణుడు కర్ణుని పొడగాంచి
అరయసాత్యకి నేమొ యితడు సంహారముచేయునని
మురసంహారుడు వెడందిహారిని యమ్ములమూడడరించె
తరుణిజువత్తుము ప్రయ్యాలుచేసెద నంబరచరులరుదంద
హరితనూజు డిదియేమి ధర్మమా నని దూషింపుచును
సాత్యకి నంతటవిడిచి శౌరిపయి సాహసమున నడరె
హత్యగోరికాండములతని ఫాలముననాటనేసె
ఘోరాంబకములనొచ్చి తానపుడు వీరావేశమున
ఔరా కర్ణా యనుచు నగ్గింపుచు వీరావేశమున
పటుతరంబున బ్రహ్మాస్త్రమేసిన పట్టినడరగూల్చె
పటుగతినరద శరసూతులను చెండివైచి వేగా
అమరనదీసుత కుంభజకృపద్రోణాత్మ సైంధవులా
అమితక్రోధమున శకుని మద్రనాథాదియోధవరుల
సోమదత్తబాహ్లికభూరిశ్రవు లామహారధికులను
ఏమరించి మద్రారిత్రిగర్తలు వివిధభూమిపతులు
అంద రొక్కమొగి చక్రధరునిపై నడరి రయంబునను
పందులేని శరపంక్తులగూల్చిన శౌరి కోపమునను

చక్కపెట్టుమని వేదవైష్ణవాస్త్రము సమంత్రకముగ
నొక్కబాణమపుడేయగ దానికి పెక్కుమ్ములు గల్గి
కౌరవవీరుల నణుమాత్రములో ధారుణి బడగూల్చి
సారసాక్షుడిటు చేయగయాదవ సైన్యంబులు జెలగి
మారిలి రౌద్రముతో కురుబలముల పీనుగపెంటలుగ
బూనియొనర్చిన గనుగొనిమారుత సూనుడు పెల్లడరి
కంసవైరిపై పటుగతివైచెను శార్ఙ్గమెక్కుబెట్టి
మూడమ్ములరథ రథ్యసూతులను బొలియజేసి వేగ
వాడితూపుల భీమునివక్షము గాడిపారనేసె
అపుడు వృకోదరు డవనికి లంఘిం చతిరౌద్రంబుననూ
ఉపమింపగ ప్రళయాంతకుడనగా నొప్పి రయంబునను
వరకరమున గదచేతబూనితా గిరగిర ద్రిప్పుచును
మురహరుశరమును దుత్తుమురుగ బడగవైచె నపుడు
శౌరివిరథుడై వేరొకయరదము సరగున దెప్పించి
మారుతసూనుని శక్తిబాణమున మడియ మనుచునేసె
దానినడంగకయున్నను మారుతసూను పోరగాంచి
గానలోలుడా యూళ్ళపురీశుడు గ్రక్కున యిట్లనియె.

క॥ తిండికి మిక్కిలి ఘనుడవు। భండనమున కోర్వలేవు బ్రాహ్మణు లిండ్లం। బండెత్తుకతిని। కండలు వేపెంచు బ్రతుకుగాదిది భీమా॥

వ. పతంగపతి వాహనుం డాడిన మాటకు ధృతిమంతుడగు భీమసేనుండు హుతవహునకు ఘృతంబిడిన చందంబున నధికరౌద్రంబున మండుచు నిట్లనియె.

కథ.

అధికప్రసంగమి దేటికి వదరెదు మధురాక్షస హరణ
వృథాయవుటగాదిపుడు నిన్ను నే నుగ్రక్రోధమునను
ఒక్కదెబ్బకె నీశిరమంతయు వ్రక్కలు జేసెదను
చక్కగ మనుమని భీముడుగదతో చయ్యన మోదగను
కైటభాంతకుడు విల్లునెక్కిడి క్రేటుదప్పించుకొని
కౌటిల్యం బగు భల్లమువేయగ కరువలినందనుడు
గదతోదానిని నుగ్గుగజేసి కడుభీకరముగను
పదపడి మురహరు యరదముమీదికి సరగునలంఘించి

అద్దనుజారియురమున ముష్టిఘాతంబు బిట్టువేచి
గ్రద్దణంగియురదంబు నొగలు తా గ్రక్కునచేబూని
త్రిప్పి నేలకటు విసరికొట్టగా నప్పళించుచున్నా
అప్పుడు సాత్యకిసీరి మన్మథులు యనిరుద్ధాదులను
చాలగ యదుభోజాంధకవీరులు సాంబసుషేణులును
కాలాగ్నులగతి నారాయణ గోపాలకు లాదిగను
గట్టిమొత్తమయి యిందరుకరువలి పట్టిని జుట్టుకొని
అట్టహాసముగ పటుభల్లపు జడిబట్టి కురిసెనపుడు
దిట్టతనంబున భీముడుగదతో దట్టుచు శరములును
చుట్టువారినిగని సూచనగా గొట్టుచున్న వేళా
మారుతి కేమో భయమువచ్చునని దేరిచూచియపుడు
ధీరతతోడను పార్థుడు మాద్రికుమారు లాదిగాగ
అలఘటోత్కచుడు నిజబలములతో నచ్చటికేతెంచి
బలవంతుం డగు యభిమన్యుం డుపపాండవులాదిగను
ఆయదువీరుల పరలోకంబున కనుపనిశ్చయించి
వాయువేగమున వెడలిమార్కొని వాసుదేవాదులను
గగనమార్గమున ఖేచరులందరు బెగడి కినుగొనంగ
అగణితముగ ధరనూళ్ళపాళె మురహరు డగ్గింపగను॥

వ. అప్పుడు యదువీరులును పాండవేయులును మహోద్దండంబుగా దలపడి రెట్లనిన.

పెల్లున బలభద్రునితో భీభత్సుడు మార్కొనియె
సాత్యకితో నకులుండు సాహసమున డానడరు
అభిమన్యుడు కోపముననడరి మన్మథునిదాకె
సహదేవుడు కోపమున సాంబసుషేణుల నెదిరె
రాక్షససేనలతోను అక్షణమున ఘటోత్కచుడు
యదుసమూహముల నెల్లగొల్లగొని గెలుచుచు నుండె
అపుడు కంససంహరుడు అనిలతనూజునిపయినా
అంబులు నిగుడింపగను అతడన్నియు పొడిజేసె
ధీరతతో మురహరుడు వారుణాస్త్రమును వేసె నంత

బిట్టు వైవగానపుడు భీముడు మూర్ఛిల్లి పడియె
జనకుడుబడుటది చూచి కనలి ఘటోత్కచుండదరి
శ్రీగోపాలుని దాకి సింహనాదంబు జేసి
శూలమొకటిమురహర ఫాలముప్రయ్యగ నేసె
చక్రధరుడపుడగ్గి చండప్రతాపముతోను
వాడితూపులను వేసివానిసారథిని గూల్చి
నునిశితాంబకము వేసిదనుజుని హయములదునిమి
క్రూరబలంబులపై చితేను నుగ్గుగావించి
తోడనె వానినిదునుము తోయజాక్షు డూహవహించి
చంద్రవంక బాణమును చయ్యన నెక్కిడి యపుడూ
ఘటోత్కచుని తాజూచి కంటకమునకు గురిజేసి
పటుగతివైవగవాడు పరగ నదృశ్యంబాయె
అపు డదృశ్యుడయిపోయి అంబరవీధిని జేరి
జరధరమైగర్జిల్లుచు చక్రధరుబలములపై
బ్రహ్మాండము బగులగను పయిపిడుగులు వడిగురిసె
తరుపాషాణాదులు తడయక నచ్చటగురిసె
నెత్తురుమాంసము మెదడున త్తరి సేనపయిగురిసె
అంబకముల జడి బట్టి అరిబలముపయి గురిసె
కొండలు చెట్లును దెచ్చి కృష్ణుసేనపయి వైచె
కడురయంబున చీకట్లుగ్రమ్మడు మాయలు జేసె
తల్లడిల్లగ సముద్రములు బొర్లి నట్లుగాంచె
ఇట్టిమాయనదివారింపా యుంది రేశుసైన్యములు
కొందరు హతమైపోయిరి కొందరు మూర్ఛితులైరి
కొందరు తేరులక్రిందదాగుట్టుగ దాగిరిచాలా
మూల్గుచుకొందరు వెరచిమూసుకొనిరి కర్ణములు
వరఘటోత్కచుడపుడు చావగమిగిలినవారి
అంతరిక్షంబునవచ్చి గొంతులు గోయుచునుండె
దనుజుల మాయలతోనుతన సేనదునుమగను
చక్రధరుడు రౌద్రమునా చక్రమునప్పుడుబూని
ఘటోత్కచుని తలదునిమిగ్రక్కున రమ్మనివైచె

ఆచక్రము మండుచును అనిలజవంబున నేగి
ముందుఘటోత్కచుమాయల్ మూలముగా మాలించి
తదుపరి వానిశిరంబు ధారుణిగూలగ దెంచి
మరల చక్రమరుదెంచి మురసంహారుపొది జేరె
ఘటోత్కచుని సహబలులగడగి శౌరిపాలియించె
కరగయూళ్ళపురిశౌరి పాంచజన్య మపుడూదె॥



వ. ఇట్లు ఘటోత్కచుని వాని సహచరులైన జలజాక్షుండు బొలియించి సఖముందు మూర్ఛదేరి చూచి దోర్దండవిక్రమంబుగా గదాదండంబు భుజంబున నిడుకొని దండధరుని చందంబున పుండరీకాక్షుని గుండెలు బగుల మోదుదు నని తలంచి మహోద్దండంబుగా నడచుచున్నం గనుంగొని చక్రధరుండు వారుణాస్త్రమును వడివేసి సమంత్రకంబుగా దుర్వక్రమంబున భీమసేనుని వక్షంబున బిట్టువైవ నమ్మహాంబకంబు భీముని వక్షస్థలంబు బ్రద్దలుచేసి వీపున వెడలిచనియె నప్పుడు అమ్మహాబలు బట్టి క్షోణీతలంబున గూల్చిన సాలమహీజంబు చందంబున నేలంబడియె నప్పుడు,

గీ॥ కడగియింతకుమును ఘటోత్కచునిచేత । బొలియమిగిలిన యాదవబలమునెల్ల। అర్జునుడుతారసిల్లి రౌద్రాస్త్రములను । వైచివిశేష మొనరించివచ్చె నపుడు॥ గీ॥ సాత్యకియు నకులుడు క్రూరసాయకముల । నొక

రొకరిజాడజరుపుచు నుగ్రముగను । బోరుచుండగ సహదేవప్రాణులదరి ।
యంతకయ్యంబు జేసిరి యద్భుతముగ॥

కథ.

ఆసమయంబున పార్థుడుసాత్యకి నాహవమున నెరిగి
గాసిజెందుమని వారుణాస్త్రమును గవ్వడి వైవగను
మునిపుంగవుడతి కోపముతో ననిలాస్త్రమును వేసి
అనిమిష నాథుని సువియస్త్రమును నపహతంబు జేసి
ఇరువదినాలుగు మెరుపమ్ములను నరునిమీదవై చె
నరుడు మూడుమార్గణములచేసిన వరునిధనువు దునిమె
అతడు వేరొక విల్లుబూని దిశాతసాయకముల
శ్వేతవాహనుని నొవ్వగ వేసెను సురలగ్గింపగను
రామకృష్ణులతో బోరుచు కవలతిరయమున వీక్షించి
వేమరుపార్థుని నొవ్వ నేసెవిధి మనమేమనుచు
వారగ సాత్యకి మీదనునరువది వాలములనుబరపి
తేరువిడచి ఘోరబలముల దునిమియుసారథి నిలగూల్చి
సీరినప్పుడు మూర్ఛితు జేయగ సీరికోపమునను
సహదేవునితా దొలగద్రోసికొని సవ్యసాచిదాకె
ఆహవమున నతడునుబోరిన పోరతి ఘోరంబయ్యె
ఆసమయంబున మాద్రికుమారులు అతిరౌద్రంబునను
వాసుదేవు నెదిరించి రయంబున నాలవుజడిగురియా
వూపిరిపఅపగ సందు లేదనుచు గోపాలుండల్గి
నాపేరెరుగర యని గ్రీడించుచు కోపాటోపమున
నకులుని తేరపు డొంటిభల్లమున వికల మొందజేసె
ప్రకటితంబుగ వారుణాస్త్రమున నకులుని బొలియించె
అతనితమ్ముడగు సహదేవుడు శరతతి గురియింపగను
ప్రతివిశిఖంబుల బాహుబలంబున భగ్నము జేయుచును
దేవదేవుడా రథికరథంబుల సహదేవునిబడగూల్చె
సేవనీయుడగు యాళ్ళపురీశుడు శాంతిబొందియుండె॥

మ॥ బలభద్రాచ్యుత సాత్యకుల్ మొదలుగా బాహాబలాటోపులై ।
బలభిత్సూనుని చుట్టముట్టిబలిబల్ బాణంబుల న్వేసినం । చలనంబందక నెల్ల

నిట్లుదునిమెర్ చండాంశుకాండంబులం । బలయోధుల్ పటుగర్వముల్ నడచె నాపార్థుండు సక్రోధియై॥

వ. అప్పుడమ్మువ్వురన్నదమ్ములును విష్వక్సేనుని చుట్టుముట్టి నిశితమార్గణంబులు నిగుడించి బెగడుపడంజేయ నతం డట్టహాసంబుజేసి బ్రహ్మాండభాండంబు చిటిలిపడం దేవదత్తంబునెత్తి రోషావేశభీషణాకారుం డయి విజృంభించి చిచ్చొరిపిడుగువిధంబున నచ్యుత రామసాత్యకులపయి నడరి దోర్దండవిక్రమంబుగా గాండీవం బెక్కుబెట్టి ప్రచండంబగు బిడుగులగతి నడరించి బలదేవసాత్యకుల నుర్వీస్థలింగూల్చె తత్సమయంబున గోపాలుండు నీరూపుమాపెద చూడుమనిన అర్జునుం డిట్లనియె.

పంచచామరము.

తమాషమాయమాటలన్ని దాచిపెట్టుమచ్యుతా । ప్రమోదమంత మాను నాకుబుగ్గడిల్లు తామసం । బమోఘమైతె మల్చుచున్న దాహయొ క్కకోలచే । సుమారమాంతమెత్తినర్ సముద్రమందువై చెదర్॥

వ. అప్పు డర్జునుండు తర్జనభర్జనంబులు సేయుచు పర్జనాదినర్జనులు నిర్జీవత్వంబునొంద ప్రళయాకాలాభీల శూలాయుధఫాలలోచనానలంబు చందంబున నుండు కొండలు చిటిలిపడం గాండీవంబు గుణంబు సారించి మహోద్దండంబుగా నప్పుడు.

క॥ సుగపదమున నుడుగణములు। దరులకు నురకంగనరుడు దారుణదర్వీ । కరమహాదస్త్రము నేసిన। ధరయూళ్ళపురీశుడపుడు తద్దయుదోడ్త్రోన్॥

క॥ సరభసమున గరుడాస్త్రము । సరిలోశివమాత్రముగ నవాశరము నుతా । హరియింపజేసిపెల్లున । సరసుడుయూళ్ళపురిశౌరి శంఖమునొత్తెర్॥

వ. ఆ పుండరీకాక్షుండు నరునియురగాస్త్రంబు తన గరుడాస్త్రంబున హరియింపజేసి పరువళురువడిజేయుచు నందనందనుడు సంక్రందన నందనునితో యిట్లనియె.

పంచచామరము.

అవు రేదురాత్మనీమ సాహసం బదొంతిరా । ధరాధరంబు వజ్రివజ్రధారగూలుభాతినీ । శిరర్ధరందొలంగచేతు సిద్ధమిపుడునీకిచే । పరిరక్షణం బునిల్పు పాకశాసనాత్మజా॥

వ. ఇట్లు వసుదేవపట్టి దాగట్టహాసంబున కట్టల్కమిట్టిపడి దట్టింపుడు కట్టకడనాటి పట్టపగటింటి ప్రాజదువుల పెట్టియను పన్నెండు వంకగట్టి మొత్తంబయిన చంద బున బిట్టుమాండుచు శార్ఙ్గంబెక్కుబెట్టి కృష్ణుం డప్పుడు.





క॥ రహిమించి ధ్వాంతమదరగ । మహిమంబగు నంధకారమమహా
స్త్రయర్క । మహిగూల్చెదనుచు ధరపయి । మహిమల్లరు నూళ్ళపాళె
మురారివి నీవే॥

వ. ఇట్లు సింధురవదనుండు బంధురంబుగా నంధకారం బగునట్లు వారుణాస్త్రంబు సంధింపం జూచి యింద్రనందనుం డపుడు.

గీ॥ అసురవైరి నేయుచు నంధకారాస్త్రంబు । భాసురాంబకమునభగ్న మొందు। నట్లొనర్చినకమలజాండంబు భేదిల । దేవదత్తమొత్తె ధీరవరుడు॥

వ. అందుకు నందనందనుండు మందహాసంబు జేసి గంధసింధురంబు చందంబున.

కథ.

వారుణాస్త్రము పార్థుడేయగ వాసినపుడుగల్గి
మారుతాస్త్రమున దానినడుమనే మడియజేసె నపుడు
అంభుజనాభుడు శక్తిసాయక మర్జునిపయి నేసె
జంభభేదిసుతు డగ్ని బాణమున శక్తిని ఖండించె
కమలాక్షుడు బ్రహ్మాస్త్రమునప్పుడు గవ్వాడిపయి నేసె
అసురేంద్రజుడును దానికి బ్రతిబ్రహ్మాస్త్రము సంధించె
హరిపార్థులు బ్రహ్మాస్త్రమువైచిన నంబరమున కేగి
పురవడించి యొండొంటిదాకి నాథోదులన్నిగలగ
తారకాగుణములు నభముననుండి ధారుణిపయి వ్రాలె
మేరుమందర మహీధరమప్పుడు బూరటిల్లదొడగె
స్వర్గము సంక్షోభించెదేవతా వర్గము బెగడొందె
మార్గముదప్పిరి కలిగిసుధాకర మార్తాండాదులును
భూతనివహమతి భీతిజెంది నిశ్చేతనంబుదాల్చె
కొంతదవ్వునకు శాంతిబొందితా నంతట నేతెంచె
అంతట నచ్చట మురాసురవైరి మహాటోపంబునను
పంతముతోడ జెలంగుచు గనుగొని పార్థుని కిట్లనియె
కుంతినోముబలమున జనియించి బలవంతుడవైనను బరగి
పాశుపతాది యనేకశరంబులు భాసురాస్త్రములను
యీశునిచే మునువడసినాడవో యింద్రుని వరతనయ
ధీరుడవనినిను మెచ్చిదిక్పతులు మెచ్చియిచ్చినట్టి
ఘోరశరానేకంబులు గల్గిన శూరుడవలెనుకద
సమరోత్సాహు డవనిప్రసిద్ధు డమితబలాఢ్యుడవె
ధరణీధర ధైర్యుడగ్రమురాజేంద్ర విక్రముడవే

సాయకవిద్యానిపుణు డడవిలో సవ్యసాచివిగద
ప్రాయసమర్థు డవనిలోజనుల కజేయుడవీవెకదా
పదపడియోర్తుల గావగనిలలో ప్రబలుడవయితివిగదా
సిద్ధము యిన్నిట గుణ్యుడవని ప్రసిద్ధుడవీవె కదా
యుద్ధము నేటికి నీవయినొక్క మహోగ్రాస్త్రం బిపుడు
విదితముగా గయుగాచినన్నదరి కదనము జేసెదవు
దర మొప్ప నేవయినదానిచే దగ్ధమయ్యేనీవు
తప్పదునీకు మృత్యంబుదీనిచే ధాత్రవాసినాడు
దీనిచేత నీవుచావక బ్రతికితె ధీరవరేణ్యుడవు
అయినచూడుమని చక్రధరుండవు డతిరౌద్రంబునను
సరభసమున నారాయణాస్త్రమును చయ్యనవెడలించి
పరగధనువు నెక్కిడి నరునిపయి పటుగతి వయివగను
అవనియాళ్ళపురిశౌరిపైవ మహదస్త్రము దావెడలి
తవిలియజాండము మాడింపుచు దందహ్యమానముసను॥

వ. ఇట్లు మహోగ్రంబుగా వెడలిన నమ్మహాస్త్రదారుణంబునకు.

క॥ పారావారము లింకం। బారెను ధరణీధరములు పటపటపగిలెఁ
బూరటిలెను బ్రహ్మాండము । యీరేడుజగంబు లాహాకారము నిండెఁ॥

వ. ఇట్లఖిలప్రపంచంబు సంచలించి పంచతనొంద అంచితంబుగా పంచభూతంబులు తేజోరూపంబులైన చాడ్పున భూనభోంతరాళంబు నతివేంద్రంబులుజేయుచు నారాయణాస్త్రంబు వెడలునప్పుడు ఝడియక నిలచి ఫల్గునుండు బ్రహ్మశిరోనామకాస్త్రంబు వెడలించి గాండీవంబునచేర్చి తురీయమంత్రోచ్చారణజేసి తన మనంబున యిట్లని స్తుతించె.

కథ.

శమనతనూజుడు నిక్కువంబుగా సత్యవంతుడైతె
క్రమముదప్పకను శౌరిపై గడగుట నిజమైతె
కుంతిమహాదేవులును పతివ్రత గురుతరముగనైతే
ఇంతకునేవురు ధర్మముతప్పక యున్నవారమైతె
బ్రహ్మశిరోనామకముచేత హరించు మహాస్త్రంబు
బ్రహ్మపాదముల సాక్షిగనిపుడది భగ్నముజేయవలెఁ
అనియిటుదలచుచు నమ్మహదస్త్రము నర్జునుండు వైచె

అనిమిషులందరుభీతిల నమ్మహాదాస్త్రంబులు రెండు
అతిరౌద్రంబున బెనగికొంత నత్యద్భుతంబుగాగ
ప్రతిహతిం బొనరింపలేకసభ బరగశాంతిబొందె
అపుడు యూళ్ళపురి శౌరిమహాస్త్రమున అర్జునస్త్రమున
అపహతమగుటయుజూచి చక్రధరు డతిరౌద్రంబునను॥

వ. ఓయి ధనంజయా నీవు మహాశస్త్రాస్త్రవేదివి విలువిద్యానిపుణుండవు వీరధైర్యధనుండవు నిన్నింతకు మెచ్చి యింకొక్కప్రయత్నంబు గలదు అది యెట్లన్నను.

ఉ॥ నాకముచొచ్చినన్ త్రిదివనాథుడు దండనువచ్చి కాచినన్ ।
భీకరమూర్తియౌశివుడు పెక్కువిధంబుల నిన్నుగాచినన్ ।
దేకువనాగలోకమున తిన్నగనాబలి చెంత నుండినన్ ।
ప్రాకటమైనచక్రమున ప్రాణములన్ బొలియింతు నర్జునా॥

కథ.

అనఘా నీప్రాణములు చక్రము కర్పణజేసెదవో
వినిగ్రహించుకొని యిప్పుడీగయుని వీడ్కొని బ్రతికెదవో
నిక్కము దెల్పు మటంచని కృష్ణుడు చక్రముచేబూని
వుక్కుమిగిలివారి బల్కుచున్న నాశ్రునిఃరసుతుడు
అంబరకేశుడొసంగిన పాశుపతాస్త్రము చేబూని
సాంబసదాశివ శంభోయని మది సంప్రార్థనజేసి
నందనందనుని గనుగొనినవాసవ నందను డిట్లనియె
ఇందిరేశనను గయునివిడువుమను టేమిధర్మమోయి
చక్రమెత్తి బెదరించుమాత్రమున చావుకునే వెరచి
అక్రమంబుగా గయునివిడుతు నని యాత్మనెంచినావా
ఇదిగో పాశుపతాస్త్రము గనుగొను మికనయినను నీవు
గదనముమాసి తొలంగిపోతివా ఘనముగ బ్రతికెదవూ
ప్రేలుచు నీవటు దొరగకుంటెనీ పీచమడచు నిదియు
కాలకర్మగతి దెలుసుకొమ్మనుచు భీముడు బల్కినను
విని సకలేశ్వరు డగు శ్రీకృష్ణుడు తనమనమున నగుచు
అనిమిషనాథుని పట్టిధైర్యమపు డాత్మలో మెచ్చుచును

పూనిపైకి నాతోపని కదనములోన డించుచును
మాననిరౌద్రము జూపెనూళ్ల పురిగానలోలుడపుడు॥

వ. అప్పుడు కృష్ణుండు చక్రాయుధంబును పార్థుండు పాశుపతాస్త్రం బునుబూని యొకరిపై నొకరు వేయం గమకించుచున్న సమయంబున సదాశివుండు దయారసభరితుండై యామహానుభావుల కదనంబు నివారింపం దలంచి జగత్ప్రాణాపహరణగ్రీవుండును వ్యాఘ్రచర్మచీనాంబరావృతుండును పద్మమిత్రవహ్ని నేత్రుండును తపనీయ నిర్మలారుణమకుటమై చను దెంచి యా నరనారాయణుల నడుమ నిలచి పుండరీకాక్షుని ముఖారవిందంబు వీక్షించి యిట్లనియె.

దరువు - శంకరాభరణ రాగము - ఏకతాళము.

కోపమేలనయ్య గోపాలకా - నీపాదభక్తుడా పార్థునిపయి॥ కో॥
నాటనుండిపెంచి కైటభాంతకా - నేటితో మనకిరీటిని జంపెదవా॥ కో॥
క్రీడిసోదరీకాంతుడే తోడ - బుట్టువుల నేడిపించదగునా॥ కో॥
పంకజాక్షనూళ్ల పాళె శ్రీధరా - సంకోచమేల నీసంగరంబుచాలు॥ కో॥

కథ.

పరమపురుష నిఖిలేశ్వరేశుడవు భావాతీతుడవూ
పరమపదంబున పరిపూర్ణంబన బయలనంగ నీవే
తత్వమసి యహంకారు డన క్షేత్రజ్ఞుడనగ నీవే
ఇత్యేక కారి బ్రహ్మమనగ భువనేశుడనగ నీవే
అండపిండబ్రహ్మాండమునీవే యఖండమున నీవే
పుండరీకాక్షా ముజ్జగంబులను పుట్టించను నీవే
యీవసుమతిలోరక్షణి సేయవ నీవె సమర్థుడవు
దేవావిలయము నొందజేయుటకు నీవే శక్తుడవు
సర్వస్వతంత్రుడవై మెలంగుదువు సాక్షివౌదు వీవే
సర్వేశ్వరానీ మహిమ నెన్నగా జాలరెవ్వరయినా
సతతముబ్రాహ్మము నేను శుభపరనుమతము మెలగుదుము
పతితపావన నీవెరుంగదె యీపనియుగలదె వినుమా
సరసిజాక్ష పలుకుదునీవు మునవరనారాయణులును
ధరణీదుర్భరమానకృష్ణ పాదాబ్ధిభాసములను
అవతరించి విలసిల్లెదువారలు అపనిసేయదగుక
ఖ్యాతిగవిూలోవిూరు యొరులకై కలహించుటదగునా

మీపోరెవ్వరు దీర్పగధరలో నోపుదు రఖిలేశ
నాప్రార్థనగైకొనుము యింద్రజు డాహవమునుగా జేయు
మనయిరువురితో సరిసమాను డని మానసముననమ్మ
వనజదళాక్షా లేనిపోని యీవట్టికలత లేలా
కరుణపార్థుని మన్ననజేసి యాగయుని నాదరించి
పరమహర్షమున నుండుమా శ్రీపురి మురళిగానలోలా॥

గీ॥ అసురసంహార నరునిసాహసము బలము। ధైర్యమును యస్త్రము లస్త్రధర్మనిరతజూచి। వేడుకలలరగంటి విజయు నిపుడు। మెచ్చినారము వరమీయవచ్చు ననఘా॥



వ॥ అని యనేకవిధంబులుగా వృషభధ్వజుండు గరుడధ్వజునకు మనోహరంబుగా దెల్పి తన భక్తుండైన కపిధ్వజు నత్యాదరంబున చేరంబిల చిన నతిభక్తితో నఖిలామరేంద్రాదుల భాస్వత్కిరీట సంఘటిత రత్న కాంతిశోభితారవిందోపలస్థమస్తకుండై లేచి కరకమలంబులు మొగిచి యి ట్లని యనేకవిధంబుల స్తోత్రంబులుచేసిన గోత్రభిత్సూనును నాదరించి దయా పరమూర్తియైన హైమవతీవల్లభుం డిట్లనియె.

క॥ శౌరియు నేనునునీదగు। శూరతకును మెచ్చినాము సురపతితనయా। కోరినవరముల నిచ్చెద । మారయవరయాళ్ళపాళె హరియను మతిచే॥

వ. అనిన పార్థుం డత్యంతసంతోషచిత్తుం డయి కాత్యాయని వల్లభునకు నమస్కరించి యిట్లనియె.

గీ॥ పెక్కువరముల నేనొల్లభీతుడైన । గయునిగాచుటవరమదే గరళకంఠ । విదితముగనాకు నీగదే విభవములను । యశముగలదూళ్ళపాళెము రారి దయను॥

వ. అనిన విని శంకరుండు నీవు కోరిన వరంబిచ్చినాను గయుని దెచ్చి కమలాక్షుని పాదపద్మంబుల బడవేయుము అతండు సమ్మతించ గలడని యీశ్వరుం డానతిచ్చిన విని యర్జునుం డప్పుడు.

క థ.

అమ్మలపొదిలో నున్నగయునితా నాక్షణమున దీసి
ఇమ్మహీవర్ధిల నీశ్వరాజ్ఞగల దేమిభయము నీకు
అని యీవిధమున దెల్పుచు గయుని కరము చేతబూని
పనివడికృష్ణుని పాదకమలములపై గయునివైచె
ప్రార్థింపుచు సాష్టాంగదండప్రణామంబును జేసి
మ్రొక్కిలేచి ఫల్గునుడు వినతుడయి మురవైరిని గాంచి
దిక్కునీవె భువనైకవందితా దీనుని గావుమిక
శరణాగత సంరక్షణకర్తవు సర్వసముడవీవు
పరమదయానిధే తమరెవ్వరికి పగవారెవరిలలో
అభయ మొసంగి మన్నించు గయాఖ్యుని అంబుజదళనయనా
త్రిభువనరక్షక యూళ్ళపాళెపుర దేవ దేవ వరదా॥

వ. అని యిట్లు పార్థుండు ప్రార్థించిన సరసిజనాభుండు కరుణాయత్తచిత్తుండయి గయుని రక్షించినానని యతనిశిరంబున తనకరంబు మోపి పరమానందంబున బల్కిన మురహరుండు పురహరుని పల్కులకు సంతసించి నరునియాసం బాలోకించి యింకొక్క వరంబు కోరుమనిన పాండవమధ్యముం డిట్లనియె.

క థ.

నగరాట్సుత హృదయేశ్వర నీవిదగిన ఫలంబులకు
తగినవాడు మాయన్నగారుమా ధర్మాత్ముండతడు
అమ్మహనీయుని యడుగుమనిన విని హైమవతీశ్వరుడు
సమ్మతించి కౌంతేయాగ్రజునటు సరగున రప్పించి
వరముగోరుమని యడుగగ నాతడు మురియుచు నిట్లనియె
పరమహేశ్వర భక్తవత్సల కరుణాకరసాంద్రా

పరమపురుష యొండుపరములొల్ల నొక వరమును గోరెదను
పరమసంగరమునందు హతం బయిపడి పోయినవారి
మరలనీవు బ్రతికింప నేర్తువీ వరమొసంగు సుభవా
సిరివరుడూళ్ళపురీశుని శాంతిగ జేసిన ధీరుడవు॥

వ. అనిన గిరిజామనోహరుండు కరుణాయత్తచిత్తుండై సమరక్షోణీ తలంబున సమసినట్టి యాదవపాండవ కౌరవానీకంబులును అంబు బొలిసిన పిపీలికంబులాదిగా గల భూతనివహంబులు పార్వతీశ్వర యిందిరామనోహరులమహిమ అతిశయంబున నిద్రమేల్కాంచు చందంబున లేచి రప్పుడు.



క॥ కురుబలములు యదుబలములు । మరలం బ్రతికితిమటంచు మరి వినయముతో । మురసంహారుని పురారిని । పరిపరివిధముల నుతించి ప్రమదంబులతోన్॥

వ. అప్పుడు కౌరవులు కరినగరంబున కేతెంచిరి యదువృష్ణిబోజాంధక వీరులు తమతమ నివాసంబుల కరుదెంచిన యనంతరంబా ధర్మజ భీమార్జున నకులసహదేవులును ఘటోత్కచాదులును హరిహరాదులనేక విధంబుల స్తోత్రంబు చేసిరట్టియెడ పాండవాగ్రజుండు మరల ప్రత్యేకంబుగా భోగిశయన నాగభూషణులకు సాగిలి నమస్కారంబులు జేసి ప్రాంజలిబద్ధుండయి యిట్లనియె.

చూర్ణిక.

శ్రీకృష్ణశ్రీకంఠులారా - పరంధాములారా - జగన్నాథులారా-ధరాదుర్భరధ్వాంసపదాబ్జులారా - బుధేంద్రాంత రంగాబ్ధి పూర్ణేందులారా - ప్రపంచంబెస్సృష్టింప రక్షింపనాశంబు నొందింపమీరే సమర్థుల్ మరిన్నేక

పౌరాణపురుషుండు బ్రహ్మేచ్యుతా మహా దేవాఖ్యలక దేజరిల్లంగ కైలాస వైకుంఠసత్యకృత్య మహిమంబెన్న ఫణీంద్రాది దిక్పాలకానేక లోకంబులయిన వచియింపశక్యం బవాచ్యం బనంతం బసంగం బఖండం బబాధ్యం బభేద్యం బబోధ్యం బవేధ్యంబుగా నుండు సర్వాత్ములారా అదే యెంచి ప్రార్థింపగా నెంతవాడనన్మదీయార్తి నాశంబు నొందించి రక్షించినారో రమాదేవి హృత్సారసాచంచరీకా నగేంద్రా మానసా కైరవా సర్వకాంతా నమస్తే నమస్తేనమః॥



వ. అని యిట్లు స్తోత్రంబుచేసిన పాండవాగ్రజునకు యిష్టఫలంబులు సిద్ధియగు నని హరిహరాదులు వరం బొసగి గయుని దీవించి సకలైశ్వర్యంబులతో మహాసంతోషభరితుండవయి నిషధాద్రియందు మణిపురంబున ఆచంద్రార్కస్థాయిగా పుత్రపౌత్రాభివృద్ధులతో నుండుమని శ్రీకృష్ణశ్రీకంఠధర్మజభీమార్జున నకులసహదేవాదులను ననగా గయుండు తననిజనివాసంబగు మణిపట్టణంబునకేతెంచి అంత మృత్యుంజయుండు పాండవేయుల శ్రీకృష్ణాదులచేత వినుతుండై వారల వీడ్కొని కైలాసంబునకేతెంచె తదనంతరంబా రామకృష్ణపార్థ్యాదులు కౌంతేయునత్యాదరంబునం బంధుబావంబుల నరయ పరమార్థులయి యనునయించిరి, పిమ్మట శ్రీకృష్ణుండు పార్థుని గౌగలించుకొని యిట్లనియె.

క థ.

పార్థివోత్తమ నీవింతవాడ వని తెలియలేక నేను
కౌరవ్యులకును నీకును ముందనిగాగలదని తలచి
అపుడు వారిని గెల్చెదో గెలువవో యనిమది నూహించి
ఇపుడు నిర్నిమిత్తముగ దారసిల్లి నే నింతజేసినాను

మేలు నీస్వసంగ్రామమునకు మెచ్చువచ్చె నాకు
చాలగా నీవిక కౌరవ్యులతో సంగ్రామంబునను
జయముగొనను సంశయము లేదు రా శక్రసునివరతనయ
గయునిరక్షణము చేసినాడవని గ్రైను సత్కీర్తి
అనుచుశౌరి పార్థుని పునరాలింగన మొనరగజేసి
అనిశ్రమమెల్లగ దీరగదువ్వెను తనకరములతోను
అప్పుడుపార్థుడు దివ్యదేహుడయి యతిమోదంబునను
ఒప్పుగ హరిపాదబ్జంబులకడ వంగిమ్రొక్కిలిడగ
ముకుళితకరకమలుండై నిలిచియు మురహరునటుగాంచి
ప్రకటితముగ మురహరుడిన్నిటిని పల్కెనర్జునుండు
దైవరాయ నేనపరాధుడ నని దలచి నిక్కువముగ
ప్రావీణ్యంబుగ ననుమన్నించుము బరమానందముగ
అనయములక్షణ సేయగవీవె యర్వాండఖలేశ
అని వినయముతో పార్థుడుబల్కిన ఘనుడు మురాంతకుడు
పరమహర్షమున సన్మానింపుచు పాండవునంపగను
పరమాత్ముడు ధరయేళ్ళపాళె గోపాలకృష్ణుడపుడు

వ. అనేకవిధంబుల యిష్టాలాపంబుతో పాండవేయుల నిలుండని నియోగించిన వారు ద్వారకానగరంబు కేతెంచిరి. అంతకు మున్ను గోకుల మందారు డగు శ్రీకృష్ణునిరాకకు నిరీక్షించుకొని వైదర్భి మొదలుగాగల అష్టభార్యలును రాచకన్యషోడశసహస్రంబును అంతఃపురకాంతలును తత్పుర ద్వారంబున బలభద్రసాత్యకుల నెదుర్కొని గోపాలదేవుని బాడుచు నివ్వాళుల నిడి తోడ్కొని వచ్చిరి.

గయోపాఖ్యానము - జంగంకథ,

సంపూర్ణము.

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాల, చెన్నపురి. (9-5-1940, 2000.)

శ్రీరస్తు.

శ్రీ కృష్ణపరబ్రహ్మణే నమః.

# దేవస్థానముల ఆక్టు.



ఇది,

వేలూరు.

కుప్పుస్వామి మొదలారి

స్వకీయ

అమెరికన్ డైమండు ముద్రాక్షరశాలయందు

ముద్రించి ప్రచురింపఁబడినది.

చెన్నపురి.

1925

# హఠయోగప్రదీపిక.

ఇందు హఠయోగము చేయుటవలన ప్రయోజనమును, అష్టాంగములగు యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధి లక్షణములును, ఆహారాది నియమములును, ఆసనప్రయోజనమును, ఆసనభేదములును ప్రాణాయామాభ్యాస లక్షణమును ప్రాణాయామ భేదములును, ప్రాణాయామ సాకర్యార్థము, ధౌతికర్మ, వస్తికర్మ, నేతికర్మ, త్రాటకకర్మ, నౌలి, కపాలభాతియను షట్కర్మల లక్షణములును, వానిగుణములును, కుంభకభేదములును, కుండలీ ప్రయోజనమును, కుండలీ ప్రబోధ ప్రయోజనమును, దశవిధ ముద్రాస్వరూపమును, బంధత్రయ ప్రయోజనమును, రాజయోగమహిమయు, ప్రాణలయక్రమమును, శాంభవీముద్రా ప్రభావమును, ప్రత్యాహార భేదములు, ధారణాభేదములు, ధ్యానభేదములు, బ్రహ్మజ్ఞానిలక్షణము మొదలగు యోగి అనుసరింపవలసిన సమస్త విషయములును సులభశైలిలో వ్రాయబడి 128 ఆసనపటములును గలిగి మిక్కిలి ఆకర్షణీయమై యున్నది. యోగాభ్యాసము చేయువారికి ఈ గ్రంథము కల్పవృక్షమువంటిదని చెప్పుట అతిశయోక్తి కాదు. గ్లేజు కాగితములో 216 పేజీలు గలిగి క్యాలికో బైండు చేయబడినది. దీని వెల రూ. 2 8 0

# జ్ఞానసింధువు.

తెలుగు వచన వేదాంతగ్రంథము. చిదానందావధూత స్వాములవారు ఒక శ్వాసమునకు ఒక పద్యమువంతున మూడువేల ఆర్నూరు శ్వాసములకు 3600 పద్యములుగల గ్రంథమును ఒకదినమందే కన్నడభాషలో రచియించియుండిరి. ఇట్టి మహత్తరమైన వేదాంత గ్రంథము ఆంధ్రులకెల్లరకు నుపయుక్తమగునటుల సామాన్యభాషాజ్ఞానము గలవారికైనను తమ "బ్రహ్మజ్ఞానము" ఇట్టిదని తేటతెల్లముగా తెలియులాగున ముద్దులొలుకు మాటలతో సులభశైలిని తెలుగు వచనకావ్యముగ శ్రీ అద్వైతానందులు-వీరప్పగారిచే వ్రాయబడినది. ఇందు వేదాంతోపనిషత్ప్రతిపాదకములగు వాక్యములచే నొప్పారెడు సమస్త వేదాంతవిషయము లిమిడియున్నవి. వేయేల ఒకసారి యీగ్రంథమును చదివి వేదాంతసారామృతమును గ్రోలిన ధన్యులు కాగలరు. వెల రూ. 1 0 0

# వేమన పద్యములు.

( వేమనజీవిత చరిత్రముతో )

**టీకాతాత్పర్య సహితము. దీని వెల రూ. 1**

---

వెస్టువార్డు అండు కంపెని, చాకలపేట పోష్టు, మదరాసు.